నారు ఆ పిమ్మట విరలవిరూపాక్షస్వామి ధ్వజారోహణమై వున్నది రథోత్సవానకు విజయం శాయవలెను అని విన్న పంశాయంగా దగ్గరవున్న దళనాయకులు ఆతిరున్నె రాయలవారు విచ్చేస్తావున్నారు స్వామి రథారూఢులైన తోడుతోనె వచ్చి విన్నపం శాయమని అంప్పించి రాయల నగరి తొమ్మిది సంప్రతులనున్ను పిలువనంపగా కరణాలు వచ్చి పదు నెనిమిది రేవుల లెఖ్ఖలున్ను వినుపించిన తర్వాత రాయల వారు దిక్కులనుంచి వచ్చిన కమ్మకాకితములు యేకాంతముగా వినుపించ్చగా విని ప్రధానులను దళవాయిని రప్పించ్చుక కొంతదడవు యేకాంతపుకొలువుగా నుండి ఆపిమ్మట నిండుకొలువుకు వచ్చినవారై సకల సామాజికులను రప్పించుక నాలుగారుఘడియలు పేరోలగంబై కూర్చుండివుండగా నగరిఅల్లుండ్లు కొమాళ్ళు దొరమన్నీలు ప్రభువులు పాళ్యగార్లు అమరనాయకులు ఆప్తులు, ఆశ్రితులు, విద్వాంసులు. పురోహితులు, ఆచార్యపురుషులు, జియ్యంగార్లు, యతీశ్వరులు, దైవజ్ఞులు, భేషజాలు, రౌతులు మావుతులు, చేర్వగార్లు, రాజులు, వందిమైతాళికులు పాఠకులు, పతాణీకులు, శాస్త్రజ్ఞులు, నాటకాలంకారులు, విద్యాధికులు, వీణాధరులు ఇవి మొదలుగాఁ గల డెబ్బై రెండు వినియోగాలవారున్ను వచ్చి కొలువుండగా దైవజ్ఞులున్ను లక్షణీకులున్ను దళనాయకులతోను ఆగతానాగత భూతభవిష్యద్వర్తమానములుగా ప్రసంగం శాయంగా ఆ పెంజడివి విద్యానగరం పట్టఁ గ్గావించ్చేటందుకు మునుపు విద్యారణ్య శ్రీపాదాలు యెందుండిరి వారు ఇచ్చటికి రాకారణమేమి వారు వచ్చి పట్టం గావించినది యెట్లు అని ఆడిగింనదులకు ముల్లం డ్రడిండిమపుంభావసరస్వతి విద్యారణ్యుల వచనాలున్ను విజ్ఞానేశ్వర మమవచనాలున్ను ఆయనకు దెలిశివుండును పుంభావసరస్వతి విన్న

## విద్యారణ్య ప్రశంస

వంశజేశినవివరం; మూకాంబికయందు జ్ఞానేంద్రసరస్వతులు విద్యారణ్యులకు ఆశ్రమస్వీకారమిచ్చి జ్ఞానోపదేశం జేశి సన్యాసాశ్రమమునకు సంమకాం

చనలోష్టం డై కామక్రోధములు కట్టిపెట్టి మదమాత్సర్యములు విడిచి శత్రువుల మిత్రువులుగా జూచి తిట్టినవారల దీవించినవారలుగాయెంచి భూమియె పర్యంకముగా శయనించి భిక్షాన్నమె అమృతాన్నమని తృప్తుండై కాషాయవస్త్రములు గట్టి నియతబ్రంహ్మచర్యానిపుణతను ఏకాంగుండై మౌనముతో దట్టు గ్రామైకరాత్రముగా చరింప మని ఉపదేశించిన ప్రకారాన్ను చలింపక సంచరింపంగా పురాతన పుణ్యంవల్ల యేవూర యేయింటికి పోయిన మృష్టాన్న భిక్షము బెట్టుచుండు అయన్నము దెచ్చి గురువు లయిన జ్ఞానేంద్రసరస్వతుల సన్నిధానమున వుంచగాను వారు జూచి సన్యాసులకు భిక్షాన్నము అర్హమింతేగాని మృష్టాన్నము యోగ్యము గాదు అట్టివట్ల రాజయోగ్యమైన అన్నము దేవచ్చునా అని కోపగించుకోంగా విద్యారణ్యులు యీశరీరానకు కావలె నని యిచ్ఛచేతను అడిగినవాడనుగాను. యేవూర యేయింటికి పోయినా యీరీతిని భిక్షం బెట్టుతావున్నారు. యీప్రారబ్ధానకు ఏమిశేతును అని విన్నపంశాయంగా, జ్ఞానేంద్రులవారు విద్యారణ్యుల పరిశోధించవలెనని తమశిష్యులను వెంబడి పంపగా, వార్లు విద్యారణ్యుల వెంబడిని పోయి అక్కడక్కడ పంచభక్ష్య పరమాన్నముతో దట్టు భిక్షంబెట్టుటను గని వచ్చి గురువులయిన జ్ఞానేంద్రులతో యీవివరం పలకరించగా వారు యితని పురాతన పుణ్యఫలము తప్పింపరాదు ప్రారబ్ధం అనుభవించక తీరదు అని మనస్సున యెంచి అయినా భాగీరథీయాత్రజేసి అందువాసముగావుండి జీవన్ముక్తుండవగుమని ఆనతిచ్చి అంపంగా అనుజ్ఞాతుండై విద్యారణ్యులు భూప్రదక్షిణముగా విరాటపురందాటి వరాటదేశానకు పోంగా ఆదిపర్వతం సమీపాన వరాహనదీతీరాన అశ్వర్థ వృక్షమందు ఋగ్యజుస్సామాధర్వణపారీణత జేసుక బ్రాహ్మణుండు ఏకదేశాన వానప్రస్థుండై వుండగాను ఆయనను చేరబోయి విద్యారణ్యులు ఆ బ్రాహ్మనిపూర్వోత్తరములున్ను గోత్రనామాలున్ను అడుగగా ఆ బ్రాహ్మణుండు సత్యవచనుండు గనక తనపేరు శింగిరిభట్లండ్రురు రఘునాయకులు రాజ్యపరిపాలనం జేశేదియునా దశాశ్వ మేధ షోడశ. మహాదానములున్ను శాయంగా తులా

పురుషదానానకు యెవ్వరున్ను పూనేవారు లేరు గనక అందువల్లను యాగఫలితం శేయ మని రఘునాయకులు షాతో పలకరించగా ఆయనకొరకై తులాపురుష దానానకు ఆచార్యత్వముగా నన్ను నియమించిరి గనక వారి చేత ప్రతిగ్రహలబ్ధం దైన దారభ్యం యీ అశ్వద్ధవన మందువానముగా వుందును తనకు ఆగత అనాగత భూత భవిష్యద్వర్తమానము లన్నియు దెలుసును అదెట్లంటేను- మీరు జ్ఞానేంద్రులవారి శిష్యులు మీనామధేయం విద్యారణ్యులు మిమ్మ భాగీరధీస్నానము జేశి అందువానముగా వుండి అచ్చటనే జీవన్ముక్తుండవగుమని నియమించి అంపినారు గనక మీరు ఆ దిక్కున ఉండతగ్గది లేదు కాశిలో వేదవ్యాసుల దర్శనమున్ను అన్నపూర్ణ విశాలాక్షీ విశ్వేశ్వరుం దర్శనమున్ను కలిగి వారి అనుగ్రహమువల్ల తిరుగా పంపానదీ తీరానకు వచ్చి పెంపుగా ఒక పట్ణంగావించి హరి హరుల పేరిట వార్లను పట్టముగట్టి ఇష్టసంపదలతో డట్టు మోదంబున వుండేటందుకు శింగ్గిరిభట్లు ఆగతం జెప్పినందులకు, విద్యారణ్యులు శింగిరిభట్లను బ్రహ్మరక్షస్సుగా యెంచి భీతిలేక ప్రత్యుత్తర మియ్యగా దలచి వ్యాసులు మనదృష్టి గోచరులు గావేరరే వారిదరిశనం యే రీతున గలిగిని అని అడిగినందులకు వ్యాసులు మీ దృష్టి పదమయ్యేటట్టు జేశేను నేజెప్పినట్టు నడిపి రాయనా నాయభీష్ట కార్యమున్ను నెరవేరును, మీకున్ను. కార్యసాధకములు కలిగీవి అని పలకరించె. గనక ఆ తీరున్నె మీ యభీష్టకార్యము న్ను నెరవేర్చేము అని పలకరించి నందులకు సింగ్గిరిభట్టు పలికే ప్రకారం అయితే మీకు కరతలామలకముగ దెలిపేము అని పలుకరించగా విద్యారణ్యులు చాలా సంతోష బడి వేదవ్యాసుల దర్శనానకు హేతువుపలకరించ మనగా శింగ్గిరిభట్లుపలికే ప్రకారం-మేము పలకరించే వార్తలు విని కాశికి బోయి మావద్దకి వస్తేను అన్ని కార్యములున్ను జెప్పేము మీరు కాశికిబోయిన సమయాన వేదవ్యాసులు కావడికుండలతో మధువున్ను భుజాన పుంచుకొని తోలుకుక్కా యిన్ని పిల్లి చెప్పులున్ను నీతిదట్టీన్ని శుభ యపార్శ్వములు చతుర్వేదసమానము

లైన నాలుగు శునకములుగూడి రాగా నికృష్టమయిన రూపము తోడట్టు మధ్యాహ్న కాలమందు గంగాతీరానకువచ్చి కావడి గట్టున దించ్చి మణికర్ణికలోన స్నానముజేసి గట్టుకు వచ్చి గోదోహనమాత్రం వెలపట వచ్చి నిలిచి వుండుకు గనక అనుమయానమీను వంకోజనడక అచ్చటికి బోయి వారిపాదములు ఘట్టిగా పట్టుకొని నందసంచేస్తేను నావంటిహీనుని మీవంటియతీశ్వరులు యీరీతున వందనములు శేతురా అని హీనకులాచారపుమాటలుగా యెన్నివిధములుగ పలకరించగా పాదములు విడువక బట్టుకొంటే అప్పుడు వారికి దయవచ్చి అనుగ్రహించేను అని జెప్పంగా విద్యారణ్యులు విని అందుండి కాశిక బోయి మణికర్ణికా ఘట్టాన కాచి వుండగా అలాగె మధ్యాహ్న కాల మందు శృంగ్గిరిభట్లు పలికిన ప్రకారానకు వేషము వేసుకొని వచ్చే వేదవ్యాసుల గనుగొని సాష్టాంగ నమస్కారములు జేసి రెండు పాదములున్ను కన్నుల నొత్తుక భక్తియై నిలిచిన సన్యాసినిజూచి యీతండు స్వస్వరూపం తెలిశినది యెట్టు అని జ్ఞానదృష్టినిజూచి విద్యారణ్యులతోను మీకు శింగిరిభట్లు దెలుపగా గదా మాస్వరూపం యెరిగితిరి అశక్త మంచిదాయెను శింగిరిభట్లు బహుకాలముగా మాకు స్నేహమైవుండును ఆయనకునిద్రాఆహారములు లేక అశ్వర్ధనన మందు చాలా అవధిపడుతావున్నాడు నిన్నుంచి కర్నాట కాన వశ నగరం కానున్నది అందు నుమ్నాట అరనై యేండ్లు లక్ష్మీకటాక్షం కలిగివుండును ఆపట్టం వున్నవాళ్లకు ఆ సింహాసనస్థునితో దెలిపి శింగిరిభట్లకు ప్రీతిగా నిత్య కృత్యమున్ను పంచభక్ష్యపరమాన్నముతోడట్టు మృష్టాన్నముగా సహస్రబ్రాహ్మణభోజనం శేయించ మని ఆనరపతితో పలికి ఆనగరమందు ముప్పైన్నపతులు కీర్తి ఖ్యాతులుగ్గలిగి నడవ కారణమున్నది అని పలకరించి కొన్ని మంత్రరహస్యములున్ను విద్యారణ్యులకు అనుగ్రహించి వేదవ్యాసులు అదృశ్యులయి పోగాను విద్యారణ్యులు ఆనందభరితుండై భాగీరథిలో స్నానము జేశి కాశీ విశ్వనాథులనున్ను విశాలాక్షిన్ని దర్శించి గయా ప్రయాగలున్ను దర్శనస్నానములు జేసి ప్రయాణగతుండై శింగిరిభ

ట్లు వున్న తావునకు వచ్చి తాము కాశికి బోయిన పూర్వోత్తరములున్ను వేదవ్యాసులు ఆనతిచ్చిన వృత్తాంతములున్ను, శింగిరిభట్లుకు దెలుపంగా శింగిరిభట్లు సంతోషబడి విద్యారణ్యుతోను లక్ష్మీకటాక్షమువల్ల పట్ణపురం గావించి అందున రాజుల ప్రతిష్ఠ జేస్తేను ఆపురానకు తా

## విద్యానగరనిర్మాణము

ము వచ్చి ఆయవనీపతులకు మే లొనగూర్చి కీడు పరిహరించుకొంచున్ను వుందున్ను. ఆచ్చట తనకు ప్రీతిగా నిరంతరమున్ను ఆనగరమందు అవ్వారిగా సత్రములున్ను దివ్యతిరుపతులున్ను పంచభూతాత్మకమైన శివస్థలాలయందున్ను గంగా, యమునా, సరస్వతీ, గోదావరీ, సింధు, నర్మదా, కావేరి, తామ్రపర్ణి మొదలయిన మహానదీ తీరాలనున్ను నిరంతరం అవ్వారిగా రేయిపగలు అన్నదానము జేసేటట్టు కట్టుడ శేయ మని మనవిజేసుక విద్యారణ్యులను శింగిరిభట్లుతో తాము విద్యానగరానకు వచ్చి అందుండి రాయలవారికి అహర్నిశమున్ను తాము ఆశీర్వాదము జేసుక ఉండవలెను అని పలికి అంపించుకొని విద్యారణ్యులు ఉత్తరదేశాన కాశ్మీరఖండమందు మండలమిశ్రులవద్దను సకలశాస్త్రములున్ను నేర్చి చింతామణి మంత్రోపదేశముచేత లక్ష్మీదేవిని ప్రార్థనసేయంగా, ఆ ఇందిరాదేవి ప్రత్యక్షమై నీకు కావలసిన వరము లడుగు మని ఆనతియ్యగా విద్యారణ్యులు తన పేరు వొక పట్ణం గావించవలసివున్నది మీరు అక్కడ యెన్నాళ్లు వాసముగా వుందురో అన్నాళ్లున్ను ఆపట్ణములోగల ప్రజ లందరున్ను సుఖస్థితిని వుండవలెను, అందు నుంచిన్ని తనపేరు కీర్తిన్ని శాశ్వతముగా నిలుచును; భూలోకమందు ఎవ్వనిపేరయినా యెన్నాళ్లు వెలయతా వున్నదో అన్నాళ్లున్ను ప్రజలకు స్వర్గాది భోగములున్ను ఐశ్వర్యప్రదమున్ను పుత్రపౌత్రాదివృద్ధిన్ని కలిగివుండును గనుక తాము గావించే పట్ణమందు మీరు శాశ్వతముగ వుండేటట్టు ఆనతీయవలె నని ప్రార్థన శేయంగా, ఆమహాదేవి మీ మనస్సుప్రకారం ఎచ్చియుండే మని అనుగ్రహించి, నీవు మమ్ము

తిరిగి జూడక పొమ్ము మేము వెంబడిగా వస్తూ వున్నార మని ఆనతిచ్చి పంపగా, కాశ్మీరదేశాననుండి వుజ్జనికి వచ్చి కొల్హాపురమందుండి కిష్కింధకురాగా, విద్యారణ్యులు తుంగభద్రలో స్నానముజేసి పంపానదీతీరానకువచ్చి పంపావిరూపాక్షులను సేవించి మతంగపర్వతిమెక్కి పట్టం గావించేందుకు చతుర్దిశములైన భూమిని నాలుగుదిక్కులు చూడగా, ఆ సమీపాన గోపులమందలోనున్న శునకాన్ని పర్వతగుహలోనున్న కుందేలు తరుమగా విద్యారణ్యులు జూచి ఆశ్చర్యపడి, లోకములోను శునకం కుందేటిని తరిమేది గాని కుందేలు శునకాన్ని తరిమేది యెక్కడ జూడము యీస్థలమహిమయేమో అని అడవిస్థలమున్న పిన్నపెద్దలను విచారించి అడుగగా వారుచెప్పినది — యీయొక్క స్థలమహాత్మ్యమియెట్ల బలవంతులుగావున్నారు మతంగమహామునులవారి శాపమువల్ల దుర్బలుల హింసించ కూడదు అని చెప్పి యున్నారు పూర్వమందు కిష్కింధలో వాలిసుగ్రీవులుండును. వారు తమలోతాము కలహించుకొని యుద్ధముజేసి ఆయొక్క యుద్ధంబుజేయుగల సమయాన మహాబలవంతుండు గనుక సుగ్రీవుండు వాలితో యెదురించి యుద్ధము చేయలేక పారివచ్చి యీ మతంగపర్వతముమీదికి వచ్చి వుండును. వాలి వెంటాడిరాగా పూర్వమందు వాలిని యీకొండ యెక్కకుండ మతంగమహాముని శాపమిచ్చినాడు గనుక ఆ దారభ్యం బలవంతములైన జంతువులైన మనుష్యులయినా యీదిక్కు బలవంతపు పని శేయబడదు అని చెప్పినారు అలాగున ఆది మొదలుగా సుగ్రీవుండు వాలితో యుద్ధము శేయకూడక యీ మతంగ పర్వతానకు వచ్చును. కాబట్టి యీస్థలానకు ఎంతబలవంతుడు వచ్చినా నిర్వాహకశక్తి లేక పారి పోవును గాని యెదురించి నిలువ లేదు అని యేమో యీస్థలానవుండే జంతువు లయినా గాని మనుష్యులైనా గాని అరిజనులకు అసాధ్య మని జెప్పగా, విద్యారణ్యులు ఆశ్చర్యపడి, ఇది ఋషీశ్వరుల మహిమగల తావు అని చాలాయెంచి యీ దిక్కున పట్టము గావించవలెను అని నిశ్చయించి అశ్వపతి గజపతి నరపతులలో నరపతియే ఘనము గనుక నరపతిరాజ్యానకు పరోపకారముగ పురం

గావించవలెనని యెన్నటికిన్ని చెలనం లేకుండా వుండేటట్టు మంచి ముహూర్తాన శంకుస్థాపనం జేశి వాస్తుపురుషుని నిలిపి నగరికి స్థలం యేర్పఱచి నగరున్ను దేవళమున్ను కోట కొత్తళములున్ను నవద్వారములున్ను యేర్పఱచి వాస్తువులు దీర్చి నిధులు యేర్పాటు శేయవలెననితమతో కూడా విద్యాభ్యాసముచేసిన చతుర్వేద శంకరాబ్ధికుండైన శిష్యుని వెం

## శంకుస్థాపన ముహూర్తము

బడిగా కూర్చుకొని నిశ్చయించి, యప్పుడు శాలివాహన శకాబ్దములు లెక్క ౧౧౨౮ యేండ్లు వెయ్యిన్నూట యిరువై యేడేండ్ల మీద వెళ్లే ప్రభవనామ సంవత్సరం చైత్ర శుద్ధ పౌర్ణమి స్థిర వారం శుభయోగ శుభ కరణములు గూడిన శుభ ముహూర్త మందు ముహూర్తముజేసి, కృష్ణపక్షం అమావాస్యనాటి రాత్రి నిశిసమయమందు శంఖుస్థాపనంజేసేటందుకు శాస్త్రజ్ఞులనున్ను మంత్రాధికులనున్ను దైవజ్ఞులమున్ను గూర్చుక ఉత్తర దక్షిణాలు యేర్పాటుకు త్రిశంకుధ్రువులనున్ను చూచి త్రిపురషించి శంఖుస్థాపనముజేసి తూర్పుపడమరలకున్ను త్రిపురషించి శంఖుక్రువులు స్థాపించి వాస్తుపురుషుని షోడశమణువులు యెత్తు బంగారున శేయించిచేవకంభమున ప్రతిష్ఠించి, ఆ స్తంభము శిరస్సుపానానకు జలాంతరముగా త్రవ్వి, సుముహూర్తమందు మేము శంఖనాదము చేసినారము ఆ సమయమందు స్థాపించమనేటట్టుగా శిష్యులతో పలకరించి, అంపించి లగ్నముతప్పకుండ నిరీక్షించుకొని వుండగా, ఆసమయమందువొకజంగమువాడుభిక్షాటనమునకు వచ్చిశంఖనాదముచేసిన వినిగురువులవారుశంఖం పూరించినారనేటట్టుగాయెంచివాస్తుపురుషునినిక్షేపించిరిగనక అవెంబడినే ఆగురువులవారున్ను శంఖనాదము చేశినది విని రెండోతేప శంఖం పూరించినదియేమో అని సందేహించి గురువులవారి వద్దికి వచ్చి శిష్యులు అడిగినందులకు, లగ్నం తప్పి స్థాపిస్తిరో అని జ్ఞానదృష్టిని జూచి జంగమువాండు శంఖనాదము చేసినట్టుగా దెలిసి చలనము వచ్చెనని విద్యారణ్యులు జూచి చాలా కస్తిబడి (శిష్యులు)

జేసిన దోషమువల్ల మూడువేలున్ను అర్యానరేంద్రలకు ఖ్యాతిగలిగి వుండవలెనని యత్నము జేశినందుకు మున్నూట అరవై యేండ్లుగా నిలిచెను. వ్యాసుల వాక్యం తప్పక నిలిచెను అని యెంచి వాస్తుపురుషుని స్థాపించినారు గనుక ఆదారభ్యం యీవరకు యిరవై తొమ్మిది నృపతులకు మున్నూరు యేండ్లాయెను. ఇంక అరువైయేండ్లు పట్టణమున్ను సింహాసనమున్ను నిలిచియుండును.

## కృష్ణరాయల పట్టాభిషేకము

అని విన్నపంజేశి...యీ రాజ్యపట్టం కృష్ణరాయలవారికి కట్టవలెనని దళనాయకులంతో పలకరించి, ఎందు ..కృష్ణరాయలవారు తాము పెద్దలమైతిమి తమ మర్యాదగా రాజ్యపరిపాలనం జేశేటందులకు పట్టాభిషేకం అధిష్ఠానకర్తలు శేయమని మంచి వేళజూచి ముద్దుటుంగర మిచ్చినారు గనక దళనాయకులు అయ్యమరసు కొండమరసు బాచరసు యల్లమరసు వీరమరసు అప్పాజి లక్కణదళనాకులు యెల్లనదళనాయకులు అప్పరసిళ్ళ మన్నారుసిళ్ళ రాయసం రామచంద్రయ్య బొక్కసం భాస్కరయ్య అవసరం వెంకటయ్య త్రియంబకయ్య లక్ష్మిపతి ప్రధాని తిప్పరుసు దళవాయిలింగరసుసాళువనార. .. కాడు ఆర్వీటిబుక్కరాజు సాళువమేకరాజు శ్రీపతివారు బూదహల్లివారు నంద్యాలవారు అవుకువారు. . తొరగెంటివారు రాచూరి తిమ్మరాజు నంగరాజు వెలుకొంటివారు.... .. పెద్దసాని అక్కప్పనాయుడు కమ్మదొరలు తుళువదొరలు మొదలయినవార లందరున్ను, నగరివిద్వాంసులు చతుర్వేది రామాదీక్షితులు అష్టభాషాకవిత కృష్ణావధానులు శాబ్దికం పాండిత్యం వెంకటరామశాస్త్రుల్లు సహస్రావధాని ప్రభాకరశాస్త్రుల్లు జోస్యులు కవీశ్వరులు మరిన్ని గలిగిన పిన్న పెద్దలు అందరున్ను శాస్త్రోక్తముగ శుభముహూర్తమందలి కృష్ణరాయలవారికి మంగళస్నానం శేయించి, కళ్యాణ వేదికయందు బంగారుపీఠమున కూర్చుండనియమించి, దశదానములు షోడశమహాదానములున్ను శేయించి

స్వర్ణతుల రజితతుల రత్నతుల మౌక్తికతుల మేషపుఖకోటిగోదానాలు సహస్రనకుటుంబప్రతిష్ఠలు మొదలైన దానధర్మములు శేయించి సప్త సముద్రములనుంచిన్ని బంగారు కలశముల వుదకములు తెప్పించి మరిన్ని గంగాయమునా సరస్వతీ గోదావరీ నర్మదా సింధు కావేరి తామ్రపర్ణి మొదలయిన మహానదుల వుదకములున్ను తెప్పించి అష్టాదశ వాద్య ఘోషములున్ను మ్రోయగా, సుముహూర్తమందు బ్రాంహ్మలచేత మంత్రోక్తముగా అభిషేకము శేయించి, ఆపింమ్మట కనకాభిషేకం నవ రత్నాభిషేకం శేయించి చలువల తళ్లొత్తి, పీతాంబరం ధరియించి, చందన అగరు కస్తూరి తట్టుపునుగు మొదలైన సుగంధాదుల ధరియించి, వారల వందనన్ని విడిదీల కంపించి, ఆపింమ్మట అల్లుండ్లు కొమాళ్ళు బంధు పరిజనులనున్ను స్నేహితులనున్ను పంక్తిని పెట్టుక ప్రసాపడి, సుగంధ జలముల హస్తప్రక్షాళనము చేశి, ఆచమనీయ్యము జేశీ, గిలుకుపావాలు మెట్టి, సంక్షేపరామాయణం చదువుతాను, శతపదాలు నడిచి, రత్నకంబళి మీద కూర్చుండుకొని, అప్పాజి మొదలైన వార్లనున్ను దళనాయకుల మన్ను ప్రధానులనున్ను పిలువనంపించి వారలతోను కృష్ణరాయలవారు ఆనతిచ్చినది।

"వీరనృసింహ్మరాయలవారు సింహాసన వరభారకం వహించ్చి నడిపించ్చిన దారభ్యం యీవరకు అచ్యుతరాయలు చంద్రమౌళిన్ని మేమున్ను కూర్చుండక వుంట్టిమి, యిప్పుడు మమ్మున రాజ్యపరభారకం వహించమన్నారు గనక తమకు. సింహాసనస్థులు నడిచే దేరీతు, ప్రజలను రక్షించే దేరీతు, పరిజనులకు నడిపించ్చే దేరీతు, ధర్మము ఆర్జించే దేరీతు, వ్రయంచేసే దేరీతు, శత్రువుల జయించ్చే దేరీతు, మిత్రువుల పోషించె దేరీతు, ఆప్తజనుల పాలించ్చే దేరీతు, ఆశ్రితుల కొలిచినవారిని ఆదరించ్చే దేరీతు, ఆత్మసంరక్షణకు అర్హులైన వారెవ్వరు, అర్థచింత వుపాయం అర్థవ్యయం సకలమున్ను తెలిశే దేరీతు, శాశ్వతమైన కీర్తి ఖ్యాతులుగలిగే దేరీతు, ఇవి మొదలైన రాజనీతులన్నియు తాముదెలిసిన

వాపసగిదా మాకు లెస్సగా తెలియజెప్ప వలె" నని ఆనతిచ్చినందులకు, అప్పాజీ అయ్యమరసు కొండమరసు బాచరసు మొదలైనవార్లు పెలుగుబుస్సు "స్వామివారు ఆనతిచ్చినది నీతికార్యమే నని, నకలనీతులున్ను, విచక్షణలున్ను, నకలకారనిర్వాహకములున్ను, సామర్థ్యములున్ను...మన్నెయాది సామాజికులతో ఆలోచించేది నకలసామ్రాజ్యసాధకమని రాయలదేవునితో రాజనీతులు విన్నవంజేసినది.

## కృష్ణదేవరాయనికి మంత్రులు రాజనీతియుపదేశించుట

" సభానాధిపతి అనంగా విష్ణు అంశ గాని యితరంగాదు. అది యేలాగంటేను "నరాణాంచ నరాధిప"మని భగవద్వాక్యం ఉన్నది.

§అందుకు నీతిపద్యం.§

క. తరుణుండై నవరత్నా
భరణుండై గంధపుష్పపరిమళయుతుఁడై
నరనాయకపరివృతుఁడై
వరఁగినవాఁడ మరు నిట సభాపతియనఁగన్.

క. శ్రీరమ్యుఁడు విజయుండును
ధీరోదాత్తుండు సుగుణతేజోనిధియై
యారయ సింహాసనమున
నారూఢుం డగుట యెప్పు నావభనెడుమన్.

ఇట్లు సింహాసనస్థుండు స్వామ్యమాత్య సుహృత్కోశ రాష్ట్రదుర్గబలంబులను రాజసప్తాంగంబుల దెలిసి ఆందోళికా అంబర ఆభరణ వాహన రాజ సన్మాన సత్కార తాంబూలంబులను ఉచిత నవాంగంబులను రాశియెరుగ వలయు సామ భేద దాన దండమాయోపాయ ఉపేక్ష మహేంద్ర జాలంబులు తెలియవలయు, రాజులకు సప్తవ్యసనంబులు గలవు. అందులకు నీతిపద్యము.

గీ. వెలఁది, జూదంబు, పానంబు, వేఁట, పలుకు
ప్రల్లదంబును, దండంబుఁబరుసఁదనము,

రాయవాచకము

పౌమ్ము విప్రప్రయోజనముగ వమ్మ పేఁత
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల.

అవి యేవి యెట్లంటేను:- వెలది, స్త్రీవ్యసనము, జూదము, జూద మాడుట, పానము, సురాపానముచేయుట, వేటబోవుట, పలుకుప్రల్లదము, తిట్టుట, అకారణంగా దండించుట, అనుచితం వెచ్చబెట్టుట, యీయేడు వ్యసనములున్ను వర్జించవలెను. ఇదిగాక, సుత నిధి దేవగేహ వనతటాక కృతి బ్రహ్మప్రతిష్ఠ మొదలైనవి సప్తసంతానంబుల బడయుచు, కవి విద్వాంస పౌరాణిక ఇతిహాస భట్ట పరిహాసక గాయకులను సభా సప్తాంగ పరివేష్టితుండై అసృక్ మాంస మేదో ధాతు అస్థి మజ్జా శుక్లంబులను సప్తధాతువుల పరిజ్ఞాతుండై, లవణ ఇక్షు సురా సర్పిదధి క్షీరశుద్ధోదకంబులను సప్తసాగర పరివేష్ఠితమైన క్షోణీ చక్రంబు నిర్వక్రంబుగా భుజా పీఠంబున ఆదరింపుచు జంబూ ప్లక్ష కుశ క్రౌంచ శాక శాల్మలీ పుష్కర ద్వీపంబులయందు విజేచ్ఛ కీర్తిప్రభలు వెలుగొందజేయుచు, హిమవంత మాల్యవంత నిషధ వింధ్య పారియాత్రక గంధమాదన హేమకూటంబులను సప్తకులగిరి ప్రభావంబులు దెలియుచు కశ్యప అత్రి భరద్వాజ విశ్వామిత్ర గౌతమ జమదగ్ని వసిష్ఠులను సప్తమహా ఋషీశ్వరుల తపస్సామర్థ్యంబుల కనిపింపుచు, శిరోవేష్టన కర్ణభూషణ గ్రైవేయక అంబర వాహన గంధ తాంబూలంబులను సప్తత్యాగంబుల నెరింగి, మరియు నాస్తిక్యంబు అనృతంబు అప్రమాదంబు అనర్థకంబు క్రోధంబు దీర్ఘ చింత దీర్ఘసూత్రితము యెరుకగలవారల యెరుంగమియు అర్థంబులయందు అనాసక్తియు అనర్థకచింత నిశ్చిత కార్యంబులు శాయమియు మంత్రంబుల రక్షింపమియు శుభంబుల ప్రయోగించమియు విషయంబుల తగులుటయు ననంబరగిన పదునాలుగు రాజ దోషంబులు పరిహరించి కనుసృష్టి పంచత్వంబువలన గోకులంబులు నందనవనంబులు జలస్థల పదస్థల వణిక్రియ దుర్గరక్షణంబుల అర్థంబు లార్జింపుచు, పంగు అంధక మూక బధిర వికలాంగులు మొదలుగాగల పాంథుల దయతో నరసి రక్షింపుచు

భయాతురు డైన శత్రువుశరణన్న గాచి రక్షింపుచు, అన్వీక్షి...దండనీతి అనియెడు తర్కవిద్యార్థశాస్త్రంబుల రహస్యంబుల నెరింగి, రథారోహణ అశ్వారోహణగజారోహణ పద...లాఘవ విచక్షణుండై, దానధర్మ పరోపకారంబులగు ధర్మత్రయంబులనెరింగి, ప్రభుమంత్ర ఉత్సాహంబులను శక్తిత్రియంబులు గలిగి శత్రు మిత్ర ఉదాసీనులను త్రివిధంబుల దారినెరింగి, ఉత్పత్తిస్థితిలయంబులను త్రివిధంబులనెరింగి, ప్రాతర్మధ్యాహ్న సాయంకాలంబులను త్రిసంధ్యావిధియమస్థుండై ఆహవనీయ గార్హపత్య దక్షిణాగ్నులను త్రేతాగ్ని హోత్రంబుల నలుపుచు, శైత్య మాంద్య సౌరభ్యంబులను వాయుమార్గత్రయంబుల నెరింగి, మేలాగు క్రముక ధవళపత్ర ముక్తాఫల చూర్ణంబులను త్రిగుణాత్మక రూపంబైన తాంబూలంబు లనుభవింపుచు,సత్వరజ స్తమోగుణంబులను త్రిగుణంబుల నెరింగి, ఉత్తమ మధ్య మాధమములను త్రివిధ నాయకలక్షణంబుల నెరింగి, ధర్మార్థ కామ మోక్ష చతుర్విధ పురుషార్థపరుండై, వేద శాస్త్ర పురాణ ఇతిహాసంబులను చతుష్టయంబుల పరీక్షింపుచు, ఋగ్యజుస్సామాథర్వణంబులను చతురాగమంబుల పరీక్షింపుచు, బ్రహ్మచారి గృహస్థ వానప్రస్థ భిక్షుకులను చతురాశ్రమంబుల వారివి దెలిసి రక్షింపుచు, రథ గజ తురగ పదాతులను చతురంగ బల స్తోముండై, మనోబుద్ధ్యహంకార చిత్తంబులను చతుర్విధంబులఁ దెలిసి, సౌరాభ్యంగన దంతధావననిర్మల వస్త్రంబులను చతుర్విధగరగరిక లుగలిగి వస్త్రాభరణగంధపుష్పంబులను చతుర్విధ శృంగారవంతుడై, ఉన్మాదన మదనమోహన వశీకరణ సంతాపంబులను చతుర్విధమదనమార్గముల నెరింగి, భద్రదంత కూచిమార పాంచాల విట విదూషక పీఠమర్దన నాగరీకుల పగుదివి హస్తిని చిత్తిని శంఖిని పద్మిని యను చతుర్విధ జాతి స్త్రీ లక్షణంబుల నెరింగి, బాల్య యౌవన కౌమారలోలులను చతుర్విధవయఃపరిపాకంబుల నెరింగి జార చతురిక సంపారిక సూతిక లక్షణంబుల నెరింగి, శబ్ద స్పర్శ రూప రస గంధంబులను పంచమహాభూతంబుల నెరింగి, శ్రోత్రత్వక్ చక్షుఃనాసికా

జిహ్వాలను పంచేంద్రియంబుల పదిలస్థుండై, మిత్రభేద సుహృల్లాభ సంధివిగ్రహ లబ్ధనాశన అసంప్రేక్ష్య కార్యత్వంబుల నెరింగి, ప్రారంభోపాయ పురుష ద్రవ్య సంపత్తి దేశకాల విభాగ వార్తా ప్రతికార్య సంధియను పంచాంగంబుల నెరింగి నడుపుచు, పృథివ్యాప స్తేజో వాయురాకాశంబులను పంచభూతాత్మకుండైన ప్రాణాపాన వ్యానోదాన సమానంబులను పంచప్రాణస్థానజ్ఞుండై, అరవిందం అశోకం చూతంమల్లి న నీలోత్పలంబులను పంచబాణములకు లోనుగాక, ఊదుట మీటుట వ్రేయుట రచ్చుపైకం ఆలాపంబులను పంచమహావాద్యంబుల నెరింగి, భక్ష్య భోజ్య లేహ్య చోష్య పానీయంబులను పంచవిధ ఆహారంబుల నెఱింగి, కటుతిక్త లవణ ఆమ్ల మధు కషాయంబులను షడ్రసంబులఋణంబుల నడుపుచు, సంధి విగ్రహ యాన ఆసన ద్వైదీభావ సమాశ్రియంబులను రాజషాడ్గుణ్యంబులను యెరింగి, హరిశ్చంద్ర నల పురుకుత్స పురూరవ సగర కార్తవీర్యులను ఆర్గురు చక్రవర్తుల చరిత్రంబులు వినుచు, గయ అంబరీష శశిబిందు అనంగ్గు పృథు నృగు మరుత్త భరత రామ దిలీప శిబి రంతిదేవ యయాతి మాంధాత భగీరథులను పదార్గురు రాజుల కథాశ్రవణ...జైన కాపాలిక బౌద్ధ చార్వాకంబులను షడ్దర్శనంబులను యెరింగి, వేదాంత, వైశేషిక, భాట్ట, ప్రభాకర, పూర్వోత్తరమీమాంసంబులనియెడు షట్శాస్త్రంబుల పరీక్షింపుచు, ధన ధాన్య వస్తు వాహన బంధుజన దాసీదాసాది జనులను గలిగి భోజన వస్త్ర గంధ పుష్ప తాంబూలంబుల ప్రియ కామినీ సంగగోష్ఠియు పాన్పులను అష్టభోగంబు లనుభవింపుచు, కులము రూపము విద్యయు చలము బలము యవ్వనము రాజ్యాంకలన అష్టమదంబులను అహంకరించి, కస్తూరి కర్పూరం చాందు జవ్వాజి అగరు పన్నీరు తట్టుపునుగు శ్రీగంధంబులను పరిమళలేపనుండై, వాగెయు రాగెయు బహుమానంబు కేళయు శస్త్రసాధనంబు వీరాస్త్రంబుల రాకయు అను అష్టావధానంబుల నెరింగి, శృంగార వీర కరుణ అద్భుత హాస్య భయానక బీభత్సరౌద్రాత్రివేశుండై, ముక్తాహా

మాణిక్య వజ్రవైడూర్య గోమేధిక పుష్యరాగ నీలప్రవాళ మరకతంబులను నవరత్న పరీక్షితుండై, పద్మం మహాపద్మం శంఖ మకర కచ్ఛప ముకుంద కుంద నీలవరయను నిధానంబులను గల్గి, నసియును భరతకళలను అష్టగణ లక్షణంబుల నెరింగి, స్వరపడి ప్లుతపడి ఉభయపడి హ్రస్వదీర్ఘ స్వరవికల్ప ప్రాగ్భవ వంశయుప్రభృతి విభాగంబుల కాకు ఆదేశ నిత్య ఆర్య అఖండ వర్గ తక్కటి యొక్కటి నరవలాట పకళలను ఇరవై పళ్ళభేదముల నెరింగి, ఋతు నాయక అభ్యుదయ వన గిరి రతికేళి జలప్రమాణ రతమధుపాన క్షితిపతి పురమత మంత్రదూత పరిణయాదు లనంబరిగిన అష్టాదశ వర్ణనములును దెలిసి, సంస్కృత ప్రాకృత శౌరసేన మాగధ పైశాచిక చూళిక అపభ్రంశ తెనుగులను అష్టభాషాప్రవీణుండయి, యతిభంగ ఛందోభంగ పునరుక్తి సంశయ ప్రక్రమ వ్యర్థలాపర్థ నిరూపిత శబ్దవిరోధంబు గ్రామ్యంబులను దశవిధ అపశబ్దముల శౌరవియ్యక, నవరసాలంకారుండై ఛందోబద్ధము, మృదువర్ణన వాక్యంబులు గలిగి, వాక్యం దశ పీఠానవైభవంబుల నెరింగి, లక్షణ లక్ష్యంబుల కావ్య నాటకాలంకారంబుల జెప్పనేర్చిన సుకవుల నరసి రక్షింపుచు, చూచుట చింతించుట వగచుట ఉస్సురనుట కొనియాడుట సిగ్గు నెరుంగక యుండుట అన్నం బరోచకమగుట జ్వరము వచ్చుట నాలుక తొట్రుపడుట జీవం తొలగజూచుట అవిమొదు దశావస్థల మర్మముల నెరింగి, వణకుట నొప్పివచ్చుట గరిగరిక విడుచుట కలహియగుట చింతనొందుట దైన్యము నొందుట దుఃఖియగుట నోర్పుల పొగలుట పున్నచోట కెలనుట ఆత్మ మరచుట నిరాహారియగుట క్రాగుట మౌనంబు దాల్చుట అరజీవం తొలగుట పంచత్వమనంబరిగిన షోడశావస్థల భేదంబులెరింగి, అంగుష్ఠం అరకాలు మడిమె మోకాలు జిహ్వా ఉరం నాభి కుక్షి కుచవక్ష గళ అధర కపోల నేత్ర ఫాల మస్తకంబులను షోడశకలాస్థాన మర్మంబుల దెలిసి, వెలిదంపు కలువ నిరిశము మామిడి జాజి శొన్న పొగడ అశోకము విరవాజి మల్లె మొల్ల గేదంగి నాబి కలువ మరబొన్న కదళికాపుష్పం

బలము షోడశ బాణంబుల నెరింగి, చిగురు విల్లు చెరుకువిల్లు తీగెవిల్లు పూవిల్లు నాల్గువిధంబుల విండ్లునుదెలియుటయు తేటినారి కురివేలునారి చిగురునారి తీగెనారి యనంబరగిన నాలుగు విధంబుల నారులను నాలుగు విండ్లును ఎక్కుబెట్టి షోడశ బాణములున్ను షోడశ కళాస్థానంబుల గురిజేశి యేయుమరునకు లోనుగాక, చౌషష్టి విద్యాప్రవీణుల అరశి రక్షింపుచు, దుష్టజననిగ్రహంబును శిష్టజన పరిపాలనంబును జేయవలయు' ఇంకా రాజనీతులు అనేకములు గలవు అందున కించిత్ విన్నపం జేసితిమి." అని అప్పాజి అయ్యమరసు కొండమరసు బాచరసు మొదలయిన వారు విన్నపం జేశినందులకు, కృష్ణరాయలవారు వార్లంజూచి "మీకు భూత భవిష్యద్వర్తమానములున్ను దూరదృష్టి కార్యములున్ను ఆగత అనాగతములున్ను తెలిసినవారలు గనుక రాజనీతులన్నిన్ని కరతలామలకముగా పలికితిరి. భ్రమరము వాయువుచేత పువ్వులవాసన నెరింగినట్లు భ్రమరకీట న్యాయముగా నన్ను నగరికి ఆదాయమున్ను అయ్యేటందులకు యేరీతు"నని అడిగినందులకు సామాజికులు "ధర్మం తప్పక నడిస్తే నెలమూడు వానలున్ను గురుసును. భూమిన్ని బహువుగా ఫలించును. నగరివారు న్యాయము తప్పక కలిగిన అప్పనం తీస్తేను నగరివారికి అధిక శ్రేయస్సున్ను గలుగును. అందు నుంచి బొక్కన భాండారములకు రొక్క రూపాయిలు బహువుగా వచ్చును," అని రాజనీతి చెప్పినందులకు — పద్యం"

న్యాయము ప్రజ పెక్కువకు ను
పాయము ప్రజకలిమి సిరికుపాయం బగుటన్
న్యాయము భండారము నర
నాయకులకును నెంద్రు కీర్తి నారాయణుడా.

అని నీతి చదివి వివరించి సాధువుల వార్లకున్ను, సాధు జంతువులకున్ను, బాధజేశేవారిని శిక్షింపక పరాకు జేస్తేను రాజధర్మత్వమున్ను,

ఐశ్వర్యమున్ను, జేసిన పుణ్యమున్ను క్షీణమైపోవు నని సిద్ధాంతం. ఇది గాక ద్వాపరయుగమందు కలియుగాదిని పరీక్షిత్తు మహారాజా రాజ్యాభిషిక్తుండై మీవలెనే ధర్మశాస్త్రములున్ను. కృతయుగమందు నాలుగు పాదములున్ను, త్రేతాయుగమందు మూడు పాదములున్ను, ద్వాపర యుగమందు రెండు పాదములున్ను, కలియుగమందు వొక్క పాదము కనక ధర్మదేవత ధేన్వాకారమై ధర్మరాజా ధర్మపరిపాలనము చేయంగా యున్నాళ్ళు సుఖాన వుంటిమి; యిప్పుడు కలి ప్రవేశమాయెను. మూడు పాదాలు అధర్మమున్ను, వొక్క పాదం ధర్మము గనుక కాలు నిలువరాదని వొక పాదం నేలమోపలేక దుఃఖాక్రాంతయై యుండగా, పరీక్షిత్తు మహారాజా నగరుశోధనకు ఏకదేశాన బయలుదేరి రాగా ధేనువును గని కాలు నిలువలేక కన్నీరు తొట్టు చింతింపుతావుండగా జూచి, సాధువులైన వార్లను యెవరు బాధజేసిరో అని రాజా కామధేనువును అడిగినందులకు — "నీవు నన్నడుగ కారణమేమి? నిన్నుండి అయ్యే ప్రయోజనము లేమియున్నది?" అని మందలించినందులకు "నీనిమిత్యముగా అడిగినానింతే గాని వూరకే అడిగినవాడను గాను" అనిపలుకరించగా," మమ్మునుంచి నీకు అయ్యే ప్రయోజనమున్ను శ్రేయస్సును పరామర్శించక వున్నట్టయితే హానికద్దా" యని అడుగగాను, అప్పుడు పరీక్షిత్తు చెప్పిన పద్యం.

క. సాధువులగు జంతువులకు
బాధలు కల్పించు ఖలుల భంజింపని రా
జాధము నాయువ్వర్గ
శ్రీధనములు విడచిపోవు సిద్ధము తల్లీ.

అను నీతి చదివి తాను అర్జున పౌత్రుఁడు, అభిమన్యు పుత్రుండు, పరీక్షిత్తుండనువాడను అభిధానం చెప్పగా అప్పుడు కామధేనువు తాను ధర్మ

దేవతను అని తన నిజ స్వరూపము కనిపించి నీ యాజ్ఞతో సకలమైన వారున్ను నడుచుకోవలెను. కలి దోషంబు తన్ను పొరయకుండా నీవు రాజ్యముచేసే దినాలున్ను నాలుగు పాదములతోడట్టు సంచరించేటందుకు ధర్మం పరిపాలనం శేయవలెను. అని ఆశీర్వాదముజేశి అంతర్ధానము పొందెను. గనుక ఆ పరీక్షిత్తు కలి దోషమునకు వుండతగిన స్థలములున్ను వుండేటందుకు నియమముజేశి రామరాజ్యమువలెను ప్రజలకు మృత్యువు వలన తస్కరుల వలన అనావృష్టి దోషమునకు భయము లేకుండా ధన ధాన్యముల పరిమితముగా కట్టడి శేయించి సమర్థులై శతాయువు పరిపూర్ణులయి సుఖాన వుండిరి. గనక ఆ రీతివలెను స్వామివారున్ను ధర్మపరిపాలనం జేసుక రాజ్యం యేలవలెనని తెలిపినారు, గనక ఆ నీతులంతా అప్పాజీ మొదలయిన వారలచేత లెస్సగా విని రాయలవారు యీ వరకున్ను యీశ్వర నాయకుడున్ను, నరసింహ్మా నాయకుడున్ను, వీరనృసింహ్మ రాయలవారు రాజ్యపరిపాలనం గావించినారు గనక యిప్పుడు ఆ రాజ్యములున్ను, దుర్గములున్ను దేశములున్ను, కోటకొత్తళములున్ను, విష్ణు స్థలములున్ను, పుణ్యభూములున్ను, సామంత పరదు రాజ్యములున్ను, జూచిరావలెనని పలకరించినందులకు స్వామివారు ఆనతిచ్చిన కార్యం.

ఉచితమేసరి, పెద్దలు ఏలిన రాజ్యములు తొక్కి చూడవలెను. ఉన్న తావున్నే యున్నట్లయితె యే కార్యమున్ను తెలియదు. అటు గనక రాజ్యములోగల ప్రజలున్ను స్వామివారిని హొగడగనవలెను. శత్రుజనులకున్ను, సామంతరాజులకున్ను, పరభీకరమగునట్టుగాను

## లోక వార్తలు తెచ్చుటకు వేగర్ల నియమించుట

చతురంగబలములతోడట్టు అష్టదిక్కులున్ను తొక్కిజూచి కీర్తి వెలయ జేసి రావలెను. అని విన్నపం జేసినారు గనక కృష్ణరాయలవారు ఆనందముపొంది భూవిస్తారమున్ను రాజ్యములున్ను జూడవలెను అని

నిశ్చయించి మునుకలుగా చారులవలన ఆ యా దేశములున్ను, ఆ యా దిక్కులనుండే దొరలు, మన్నెరికముల పతకలున్ను, వారివారి కలిమి బలములున్ను, గ్రామాదులున్ను, పల్లె, పట్టములున్ను, పండిత పామర జనులు అడుకొనే వార్తలున్ను, కోటకొత్తళముల యందలి ఎడవడికెలు తెలిసి నానాటి ప్రవర్తకములున్ను గోప్యముగా వచ్చి పలకరించేటట్టుగా, కాలు వేగం గలిగి బుద్ధివిచక్షణులై బహుభాషాంతరములు తెలిసి బహురూపములుగానున్ను సంచరించి అంతరంగ వార్తలరసి వచ్చేటట్టుగా విజయాపురం, అహమ్మదానగరం, బెదదకోట, రాజమహేంద్రం, ఆరంగం, చెన్నపట్టం, శ్రీరంగపట్టం, చదరంగపట్టం, శ్రీరంగం, మధుర, రామేశ్వరం, పుమ్మత్తూరు, శివసముద్రం, పెనుకొండ, గోలకొండ, గుర్రంకొండ, పేల్నాదు, మొరసునాడు, పుట్టంశీమ, అరవరాజ్యం, మళయాళం, కొచ్చి, కొంకణం, కేరళం, విరాటపురం, వరాటదేశం, మగధ దేశం, మత్స్యదేశం, విదర్భదేశం, కాంభోజ నగరం, కాశ్మీరఖండం, ఢిల్లీనగరం, ఇవి మొదలయిన తావులకున్ను, తులువ హైవ మొదలయిన దక్షిణ రాజ్యములకున్ను, చంద్రగిరి, గండికోట, కడప, ఎంద్యాల, బెల్లంకొండ, రాచూరు, ముదుగల్లు, విడిగల్లు, మైసూరు, మొదలయిన స్థలములకున్ను వేగుర్లున్ను నియమించి అంపించి పట్టణముల సంచరించంగా అహంకరించినారనిన్ని పరులత్రోవ పోయినారని వినినామున్ను వారిని ఆజ్ఞసేయమని కట్టడ చేసినారమని మీరందరున్ను నగరి ఆజ్ఞ మీరక నడచుకొమ్మని ఆనతిచ్చినారు.

## కృష్ణరాయని నిత్యకృత్య వివరణము

కనుక ఆవి మొదలు నమమైన వార్లున్ను భయస్థులై పట్టములోనున్న. వీధులయందున్ను, మార్గములయందున్ను యెవరు యెదురు తాకినా యేమని తలంచేవారు లేక సుఖముగా సంసారము చేసే రీతికి నడిపించి రాయలవారు నిత్యకృత్యములున్ను రాత్రి కొలువుతీరిన తర్వాత

నగరు శోధనకు విచ్చేశి సకల కార్యములున్ను తెలుసుక, అరుణోదయానికి నగరికి వచ్చి కొంతతడవు పవ్వళించి యుదయాననేలేచి దంతధావన, ముఖమజ్జన, నామ తీర్థపు కొలువుజేసుకొని పెద్దకొలువునకు వచ్చి తాము రాత్రి నగరు శోధనకు బయలమెరశినవేళ గనుకొన్న కార్యములు విన్న కార్యములన్నియు మనస్సుకు దెచ్చుకొని, తలారి జంగయ్యను జూచి రాత్రి పట్టములోని ప్రవర్తమానములేమి అని అడుగగా సకల కార్యములున్ను విన్నపం జేసును గనక తాము జూచినందులకును సమరసముగా వున్నట్టాయను విని పూరకేవుందురు. నడచిన కార్యములలో బలదుర్బలములు తెలుపకపోతే యీ పాళ్యాన యిటువంటి వీధిని యీయీ శ్రేణిలో ఇంన్నో యింటివద్ద రాత్రి-నడచిన న్యాయములు తెలిసినవాడవుగావు విన్నన నేరములేమి నీవు తలారికం జేసేదిన్ని మేము రాజ్యపరిపాలనం జేశేదిన్ని లెస్సాయెనని ఆగ్రహపడగా తలారి భీతిజెంద తాను రాత్రి పగలు నిద్రాహారములేక వీధులను మనుష్యుల నుంచుక క్షణేక్షణే నడుచు వార్తలు పరామర్శించి రమ్మని భద్రపరచి రాయలవారికి యెవ్వరు మరుగుపడ విన్నవించినారో అని పరామర్శించగా రాయలవారు నగరు శోధనకు వెళ్ళి పరామర్శించగా కన్న కార్యమింతేగాని విన్న కార్యము గాదు అని యెంచి అనారభ్యం పట్టములో కాపెలికట్ల వారితోను జతనముగా కాచి నడచు కార్యములు వచ్చి తెలుపుమని దిట్టపరచి రాయలదేవుని వారు రాత్రి నగరుశోధనకు వెళ్ళుదువని యెవ్వరిని అడుగక వీధులలో దుడుకులు రానియ్యక హెచ్చరికతో నుండుమని పలికి తానున్ను తనకు ఆప్తులయిన వార్లున్ను తన్ను కొలిచిన వార్ల తోడట్టు రాయలదేవుని వారు కొలువుదీరి నగరిలోపలికి పోయిన క్షణనే హజారమువద్ద కాచి వుండి నగరు బిగమ్ము దలయిన రెండు ఘడియలకు రాయలవారు లీలావతారముగా బయలుదేరే జాడజూచి కనుపించుకోగా, అంతటంతట హెచ్చరికగా రాగా రాయలదవాని ...... జూచి తలారి జంగయ్యను పిలిచి "మేము నిత్యకృత్యమున్ను నగరు శోధనకు బయలుమెరశి నతుము నీవున్ను ప్రీతిగలవారున్ను దూరాన కనుపట్టక రమ్మని" అన

తిప్పినారు గనక తలారి జంగయ్య ఆదారభ్యం భయము గలిగి రాయలవారు నగరు శోధనజేశి తిరుగా నగరు ప్రవేశం అయ్యేవరకున్ను వీధివీధుల వెంబడినే తిరిగి మరిగి తన ఇంటికి కొంపకు పోవును. యీ వర్తమానములు అప్పాజీగారు మొదలైన సామాజికులు విన్నవార్లయి వారు వారు ఆలోచనాపరులై తమ తమ యిండ్లలోను రాత్రిపగళ్ళు మాట పలుకులాడుకొనేటప్పుడు యాది హెచ్చరికలు గలిగి ఆప్తాలోచనలు నడుపుతావుందురు. యీరీతిని వుండగా కృష్ణరాయలవారు నిత్యకృత్య మున్ను ప్రాతఃకాలమందు పద్యనీతిచదువమని వింటావుందురు. గనక వకనాడు పద్యనీతి చంద్రయ్య తనకు రాకూడక తన కుమారుని నగరికి అంపగా ఆయన వచ్చి సంజయనీతి, విదురనీతి, చాణుక్యనీతి, భర్తృహరి నీతిశతకము, ఇవి మొదలయిన నీతి చదివినాడు. గనక వకపద్యమైనా తప్పక చదవగా రాయలవారు సావధానచిత్తులై వినేయెడల పద్యశతకమున వక నీతి పద్యము.

క. బలవర్గము సామంతుల
బలమున కగ్గలముగల నృపాలున కొదవే
బలిమె పెఱనృపతి కాజ్ఞా
బలసంపద కెంత దవ్వు బద్దె నరేంద్రా.

అని నీతి పద్యము చదువగా రాయలవారు ఆ పద్యము ఇనుమారు ముమ్మారు చదువమని మన్ననకు తెచ్చుక వకనాడు కొలువులోపలను కరణీకుల పిలువనంపి వారలతోను కర్నాటక సింహాసనమునకు ఎన్ని లక్షల రాజ్యములు? ఆ రాజ్యములో గిరిదుర్గ, స్థలదుర్గ, వనదుర్గ, జలదుర్గములు యెన్ని? కోటలు యెన్ని? నగరములు గ్రామభూములు యెన్ని? యేయేదుర్గాలకు యెంత నగరి బొక్కసాన వుండే? రొక్క రూపాయలకున్ను, నవరత్న భూషణములకున్ను? స్థాపించివుంచిన నిక్షేపములకున్ను, శిమమణీయగార్ల మీద చెల్లునిలువకున్ను, నగరికై జీతం, యేనుగ, గుఱ్ఱం, పరిజనాలకున్ను, వివరముగా లెక్కవ్రాసి

తెచ్చి చదువమని తొంమ్మిది సంప్రతులనున్ను పిలుపించి ఆనతిచ్చిరి, గనక చిన్నభండారం అల్లాలనాథుండు విన్నపం జేశినది. "యీ వరకున్ను వీర నృసింహరాయలవారు లెఖ్ఖపఖ్ఖలు అడిగి పరామరిశించిన వారు కారు. ఇప్పుడు స్వామివారు లెఖ్ఖలు పరామరిక జేస్తున్నారు గనక యేయే లెఖ్ఖలు విన్నపం శాయమన్నారో ఆయా లెఖ్ఖలు

## కోశాది వివరణము

శేకరించి వ్రాసి నేట మర్నాటను అన్నియు విన్నపం జేశేమని లెఖ్ఖపఖ్ఖలు జాగ్రత్తగా రేయూపగలు వ్రాసి శేకరించి ఆ మరునాడు లెఖ్ఖ విన్నపం జేశినది. విద్యారణ్యస్వాములవారు యీ పట్టం గాపించేటప్పుడు సింహాసనస్థునికి నిక్షేపించినది తొంబై తొమ్మిది కోట్లు యాభై యారు లక్షల ద్రవ్యంగాక భూషణములు నాలుగు కోట్లున్ను, నవరత్నముల ఆరు కోట్లున్ను, వున్నది. అవిగాక యీ వరకున్ను సింహాసనస్థులు సింహాసనమున్ను నడుపుకొని శెలవు శిద్ధాయాలు పోగా బొక్కసాన వుంచినది పందొమ్మిది కోట్ల యాభైయారు లక్షలద్రవ్యం. ఇదిగాక కర్ణాటక రాజ్యం పదికోట్లు యెనభైనాలుగు లక్షలున్ను, దేవాదాయం, బ్రహ్మాదాయం, సర్వమాన్యం, మఠపరములకు అరవై లక్షలు పోగా నిలిచినది పదికోట్లున్ను, ఇరవైనాలుగు లక్షల రాజ్యాన జీరావంజ్జోక గుఱ్ఱములకు, రోజా గుఱ్ఱం వొఖ్ఖంటికి మూరేశి ఘెట్ల లెక్క గుఱ్ఱములు వెయ్యింటికి లక్ష ఘట్ల వంతున గుఱ్ఱాలు యిరవై నాలుగు వేలింటికి, యిరవై నాలుగు లక్షలున్ను, యేనుగ వొఖ్ఖంటికి రోజా వెయ్యేశిఘెట్ల లెక్క, యేనుగలు నూట యిరవైయింటికి పంద్రెండు లక్షలకున్ను యేనుగలు వెయ్యిన్నెన్నూర్రు. బంటు ఒక్కంటికి నెలకు ఘట్టీ రెండేశి వరాలలెక్క, బంట్లు వెయ్యింటికి రెండు వేల వంతున రెండులక్షల బంట్లకు రోజా నాలుగు లక్షలున్ను, యీ లెక్క ప్రకారాన అమరనాయకం, గుఱ్ఱాలు ఏనుగలున్ను, పంద్రెండు వేలున్ను, కాల్బలములు రెండు లక్షలున్ను, ఇందుకు రోజాకున్ను

ఆయకం, ఆవవని, బెమ్మేటి దుర్గం, గుత్తి, గండికోట, చంద్రగిరి, గుర్రం కొండ, మద్దూరు, సోమగిరి, త్రిశిరపురం, కన్నడాపు, పెను కొండ, ముస్తి దులయిన దుర్గములున్ను, నంద్యాల, శ్రీరంగపట్ణం, వుమ్మత్తూరు, దళవాయకుల కోట్లావల్లంకోట, మధుర, పాళ్యం కోట, దిండికల్లు మొదలైన సత్యవేడు, కొట్టికల్లు, దంకినీకోట, వారణవసం మొదలైన వనదుర్గములు దేశములు గల రాజ్యమున్ను యేలుకొని కొలుస్తావున్నారు. లెక్క క్రమానికి శీమలు కొని యేనుగు, గుర్ర ములు, బంటు బయదలు, ఆబద్ధితికి కొలువక వున్నారు. గనుక చిత్తానకు తేనవధరించేటట్టు వ్రాయవలెను అని విన్నపం వ్రాయంగా రాయలవారు కరణాలతోను అమరనాయకానకు వగరికవిలె హావలిప్రకారాలకు యేనుగు, గుర్రంబంటు బయదలకు వివరముగా లెక్క వ్రాసితెమ్మని ఆనతిచ్చిన తర్వాత సగరికై జీతం, యేనుగు, గుర్రం, రాణువకు లెక్క యేమిన్ని చదువలేదని మనస్సున యెంచి అప్పాజి అయ్యమరసు మొదలైన వారిని జూచి ముందర నడిపించతగ్గ కార్యములకు ఆలోచన యేమని అడిగినందులకు, అందరున్ను వూరకే వుండగా సాళువ తిమ్మరసు గారు ఆలోచనపరుడై ఏమిన్ని ఎలకరించక స్వామివారు చిత్తానకు వచ్చినట్టు నడిపింతామని సంబుద్ధిగా విన్నపంజేశినాడు గనక రాయలవారు తమచిత్తాన సింహాసనవ పరభారమునకు కర్తల జేసినమాత్రం ఇంతే గాని సకల ప్రపంచంమున్ను సామాజికులు ముఖాంతరముగానే నడుస్తా వున్నది తమమాట పలుకులు యెవ్వరు వినేరు అధికారతరుణమందు స్వాతంత్ర్యముగా నడిపిస్తే మంత్రభిన్నమై కార్యములు కొనసాగదు. కాబట్టి వాకిటి పిన్న పెద్దలు తమరయ్యే తెలుసుకొని ఒక కార్యం నడిపిస్తే అప్పుడు తమకు స్వతంత్రముగా నడుచును. అనుచు, మనస్సున దూర యోచన యెంచి ఒకనాటి రాత్రి నగరు శోధనకు బయలుదేరినట్టు నగరు వెడలి పట్ణానకు రెండామడ దూరాన ఉత్తరపుదిక్కున నొక దేవళము

## కృష్ణరాయలు పట్టణ శోధనకుంబోవుట

ఉండగా అక్కడికిపోయి నిలిచి నంబివాణ్ని నీళ్ళు తెమ్మని దంతధావన ముఖమజ్జన నామతీర్థమై స్వామి నివేదనమైన ప్రసాద పణ్యారములు తెప్పించుక ఆరగించి కూర్చుండగా అంతట పట్టంలో యెప్పటివలెనే సాళువ తిమ్మరసుగారు నగరికి వచ్చి రాయలవారు పుష్పోదయమైనారో అని పరామరశించగా అచ్చట కాచియుండే దాదులు హెగ్గడికత్యలు బోనకత్తెలు అణ్నాగర్లు నిన్న రాత్రి రాయలవారు నగర శోధనకు పోయినట్టే యింకా రాలేదు అని పలికినారు. గనక వారలతోను యికను యెవరు వచ్చి అడిగినా గాని రాయలవారు శిరోభారమై ఇంకా పుష్పోదయం కాయలేదు అని చెప్పేటట్టు నియమించి హజారము ఖానకు వచ్చి కూర్చుండి గూఢచారులను అష్టదిక్కుల మార్గములనున్ను పరిశోధించి యేకాంతముగ వచ్చి పలుకరించమని అంపగా, ఆచారులు యెనిమిది దిక్కులకున్ను పోయి విచారించిరి గనక వారిలో పరిశోధకుండైన గూఢచారుడు వచ్చి సాళువ తిమ్మరుసుగారితో పట్టానకు రెండామడ దూరానకు ఉత్తరముగాను పళ్ళకొండరంగనాథస్వామి సన్నిధిక ఏకాంతముగా విచ్చేశి కూచుణాండుక పట్టణము దిక్కు ముఖము చూస్తావున్నారని రహస్యముగా పిలువగా అప్పాజీ దొరమన్నీలకు, అమరనాయకుల కందరికిన్ని రాయలవారు వేటబోవుతావున్నారు మీ స్తోమముల తోడట్టు శీఘ్రగతిగా రమ్మని అందరికి చీట్లువ్రాయించి అంపించి తాము మునకలుగా తరలిపోయినారు గనక పట్టణములోగల రౌతులు, మా వుత్తులు, బంట్లు, పరివారములున్ను, దొరలు మన్నెరికములున్ను అందరున్ను ఆ క్షణమే కదిలి పోఇనారు. అందుకు మునకలుగా తిమ్మరసయ్యగారు కూడాను విల్లుబెట్టు మేరకు అందలముడిగ్గి బంటు బియదలన్ను, యేనుగ గుర్రములనున్ను, బారుదీరివుండేటట్టు కట్టడజేశి మితపరిజనము తోడట్టు కొంత దూరముపోయి అచ్చట అందరినిన్ని నిలువమని యేకదేశాన తాము వక్కరే కోట వెలపట వొంటిగా పోగా రాయలవారు తిమ్మరసయ్య వచ్చేదిగని పచ్చడము నిండారుగాగప్పుకొని నిద్రపొయ్యేరీతిగా వుండగా

అప్పాజీ రాయలవారి వద్ద చేతులు కట్టుకొని నిలుచుండి వుండగా కొంత సేపునకు కనుపించుకోక ఆ తర్వాత రాయలవారు నిదుర మేలుగాంచిన రీతిగా లేచి అప్పాజిని జూచినవారై మీరు యిప్పటికి యేల వస్తిరి అని అడుగగా తిమ్మరసయ్య అర్ధబిడివిన్నపంజేసినది—స్వామివారు నిన్నరాత్రి నగరు శోధనకు బయలుమెరిసివచ్చే యిప్పటికి విచ్చేసిన మార్గము తెలియదు యథావత్తుగానే నగరికిపోయి పుష్పోదయమైనారో అని అడుగగ హెగ్గడి

## తిమ్మరుసు రాయలవారిని మందలించుట

కత్తెలున్ను అణ్ణాగళులున్ను రాయలవారు నగరు శోధనకు పోయి నదే వచ్చినవారు గారని చెప్పగా మనమ్మకు చాలా విచారమై ఆయా దిక్కులకు చారుల నంపగా అచ్చట విచ్చేసి వున్నారని చెప్పగా విని యీ వార్త ప్రకటించరాదు అని మనసున యెంచి రాయలయారు వేట మార్గముగా సాగిపోయినారు గనక దొరమన్నీల అందరినిన్ని తమతమ స్తోమములతోడను శీఘ్రగతిగా సాగి రమ్మని చీట్లు అంపించి వద్దనున్న వారితోను రాయలవారు వేటమార్గముగా సాగిపొయ్యేటప్పుడు రమ్మని ఆనతిచ్చి అంపినారు గనక పోవలసివున్నది అని వార్లతో మందలించి కదలివస్తిని. స్వామివారు యీ రీతిని రావచ్చునా? యీ వార్తలు లోకులకు తెలిసితేను పట్టణమున్ను కొలుపోవును. దునేదారులు విన్నానున్ను అపకీర్తి, గనక యింతటి కార్యము జేసేది అనుచితము. స్వామివారి చిత్తాన యింత కార్యమెంచి రావచ్చునా అని నీతి మార్గముగా మున్ను భయోత్పాతములుగనున్ను తెలిపినంతలకు రాయలవారు, "సింహాసన పరభారకం వహించే మీ వంటి పెద్దలువుండగా అట్టి కార్యములు యేల వచ్చేని మీరు తృణాన్ని బట్టితే మేరువు చేయగలరు. ఆ మేరువునే తృణముగా నడిపించగలరు. ఆ ఘటనాఘటనా సామర్థ్యములు మీకే గలవు", అని వ్యంగ్యోక్తులుగా ఆనతిచ్చినందులకు సాళువతిమ్మరసయ్య పలికినది, "ఆరీతే అవును. అని యేమియంచేత స్వామివారు సకల కార్య భారములున్ను మామీద పూనికె జేసి నడిపించంగా ఆరీతున

వదుస్తా వున్నది. చిత్తానకు రాకుంటే మేమనగా తృణమాత్రం. తృణగ్రాహి యయిన యింద్రనీలము ఖ్యాతిబొందును. తృణమని యెంచి గ్రహించక వున్నట్టాయెనా జాతి నీలము గాదని వెల తరుగును. అటు గనక యేలిన స్వామివారి ప్రతాపమువల్ల నేగదా కొలిచినవారు ఘనమౌట కొలిచినవార్లను ఘనముగా నడపగానే యేలినవారికి కీర్తి ఖ్యాతులు గలుగుట," అని ద్వంద్వార్థముగా విన్నపముచేశి పట్టానకు విచ్చేయుడా అని తెలిపినందులకు రాయలవారు తన ధొరతన మేమి అనంగా యేంది తన అంక్కవంక్కలకు యెవరు వచ్చేరు, రాని వారిని మేము యేమి జెప్పేము, దండించనర్హులముగాము దండనాయకత్వం లేనివారికి ధరణి యేలేదెట్లు, ధర్మపరిపాలనం చేసేదేరీతు, దుష్టనిగ్రహం శిష్టపరిపాలనం శేయవలెనని చెప్పి తిరుగా అందుకు ప్రతిచింత కట్టివచ్చేము లేనప్పటికి రాకూడదని నాలుగారు ఘడియలు ఆలోచనశేయగా, సాళువ తిమ్మరసయ్య స్వామివారు ఆనతిచ్చిన యంతమట్టున్ను యధార్థమున్ను కార్యపరవిన్నే అవును. అందులకు యిది బుద్ధియని ఆనతిచ్చినట్టయితే స్వామివారి ప్రతాపమువల్ల అన్ని కార్యములున్ను అమరిక అయ్యీని. అని తెలిపినందులకు రాయల దేవుని వారు తమున స్వతంత్రులు తెచ్చిరిగా ఆ రీతున్నే నడిపించుడా అని ఆనతిచ్చి యున్నాకున్ను నీతిపద్యము విందుము మునాటియందున విశేషమైన బుద్ధిమార్గములుగా వకు నీతి పద్యము వింటిమి గనుక అది మొదలుగా ఆ రీతున నడిపించుకోవలెనని బుద్ధితౌడమి సామంత బలముకన్నా అధికమైన బలాల సంతరించి తురకలమట్టుబెట్టవలెననితెంచినారము. యిందుకు యేమంటేకై జీతము లేక యే కార్యములున్ను కొనసాగదు గనక యిప్పుడు కై జీతము, యేనుగు, గుర్రము, బంటు, బయదలు సహితముగా గట్టి ఆముస్తీదు లోకట్టు పట్టప్రవేశం గావలెనని ఆనతిచ్చినారు, గనుక సాళువ తిమ్మరసయ్య యీ కార్యానకు స్వామివారు యీరీతునరావచ్చునా యీ క్షణాన్నె దేవర వార్లి-తిత్తానకు వచ్చేటట్టు యేనుగు గుర్రాలు బంట్లునందరిని న్ని సంతరించేను. మరి వెనుకను చతురంగ బలములతోడట్టు పటానకు

విజయం చేయంగా అని విన్నపం జేశినందులకు యీ శకానన్ని నగరికి యేనుగ గుఱ్ఱము బంటు సహితముగా అమరిక జేశేను, అని విన్నపము జేశి తోడుతోనే దొరమన్నె వార్లను అమరనాయకంవార్లను రవుతు రాహు వును దెళ్ళై రెండు నియోగాల వారున్ను కొలువునకు రమ్మని కందా చారం కరణాలపిలిపించి వారితోను సింహాసనాన అమరనాయకం యేను గులెన్ని, గుఱ్ఱాలెన్ని, కాల్బలమెంత అని అడిగినందులకు గణికులు పలుకరించిన వివరం.

## రాయల సేన వివరణము

గుఱ్ఱాలు యిరువై నాలుగు వేలు, యేనుగ ఘట్టాలు నూట యిరువై, కాల్బలము రెండు లక్షలు. ఇందులకు స్థితి నెలవొకంటికి నలభై లక్షలు వంతున సంవత్సరానికి నాలుగుకోట్లు యెనభై లక్షలకు అమర నాయకానకు శీమలు యేలుచున్నారు. అని గణికులు విన్నపంచేశినందులకు వారలతోను రాయలవారు అమరం యేనుగు గుఱ్ఱాలకున్ను, బంట్లకు న్ను, నేడు నాలుగారు ఘడియలలోగా గణుతిబెట్టి గణుతికి లేనియేనుగు, గుఱ్ఱాలు, కాల్బలమునకున్ను వీరనరసింహ్మరాయలవారు యేలుకొన్న దారభ్యం యీ వరకున్ను పది సంవత్సరాలాయెను గనక వారివారిమీది రొక్క విలువలు లెక్కజూచి తోడుతోనె నిలువరూకలు హరువుశాయ మని నిరుత్తరువుగా ఆనతిచ్చిరి గనక అదే రీతికి కరణాలు వెలపటికి వచ్చి గుఱ్ఱం రాణువ, గణుతిపెట్టంగా వకటికి సగమున్ను నాలుగింటికి వక పాలున్ను గణుతికి తక్కువబడె గనక అమరగార్లమీది నిలువ రొక్కమునకు ఆక్షణమందేవొప్పుజెప్పుమనగా వార్లుబహుదినాలమంచిన్ని ప్రఖ్యాతిగా తిన్నవారు కాబట్టి తమమీది నేరం తప్పిపోతే చాలునని తమ మీది మోపాది అయిన రొక్కానకు యియ్యవెరవు లేదుగనక శీమల యెప్పటివలెనే నడిపితేను యిప్పుడు వుండే యేనుగ గుఱ్ఱాలను నగరికి వెలకట్టి యిచ్చి ఆపేంమ్మట తాము సంతరించుకొనేము, అని విన్నపం శేయగా మంచిదే యని అమరగార్లమీది నిలువలకు యేనుగ గుఱ్ఱాలను

వెంకట్టుకోగా యేమగలున్ను పండ్రెండు వేల గుర్రాలున్ను లక్షబంట్లు యేలే దొరలనున్ను నగరిశరబడి అయనుగనక ఆయేనుగ, గుర్రాలు, కాల్బలము రాయలవారి సముఖానకు తెచ్చివిడిచి చిత్తం వచ్చిన వారికి వెచ్చబెట్టండా యని విన్నపం శేయంగా రాయలవారు ఆశ్చర్యబడి అప్పాజిగారితో అఘటనఘటనాసామర్థ్యము మీకె కలదు అని ఉచిత వస్త్రాంగము, కుళ్లాయి, కబాయ, శాళి, చౌకట్లు, పీతాంబరం, గంధకస్తూరి తాంబూలాదిగాయిచ్చి కైజీతం యేనుగలకు తుళువమావటీలున్ను, కైజీతం గుర్రాలకు కబ్బిలిరౌతులున్ను, మొరస రౌతులునన్ను, తుళువర్ తుమన్ను యేలికబంట్లను వ్రాయించి ఆ పిమ్మటను రాయలవారు బంగారు చౌదోలుముస్తీపు అయిన మాస్తి మదహస్తియనే యేనుగను ఎక్కికొని సాళువతిమ్మరసయ్యను తమవెనుకనుకూర్చుండమనిచతురంగ బలముతోడట్టు విద్యానగరపట్నం ప్రవేశమై తర్వాత అప్పాజి తిమ్మరసు మొదలైన వార్లను యిండ్లకుపంపించి తమ ఆప్తులతోను అప్పాజి సాళువ తిమ్మరసయ్యలవలె నియ్యోగులుకద్దా అటువంటి నియ్యోగులు వుండగా వళనాటనే కైజీతం కట్టవలెననిన్ని, లేకుంటే పట్నానకు రామనిన్ని దుష్కరవచనంగా పలకరించినందుకు తాలిమి గలిగి ఆ తీరున్నె అమరిక జేశేను, అని యేనూరుయేనుగలున్ను, పండ్రెండువేల గుర్రాలున్ను, లక్ష మనిషి బంట్లున్ను, నిమిషమాత్రాన సముఖానకు రప్పించి చిత్తం వచ్చిన వారికి శెలవు శాయమనగా, చూచి ఆశ్చర్యబడి ముందర తురకాణ్యం పెద కార్యం శేశేవారమై కర్నాటక రౌతుల మావుతుల సంతరించవలెనని దృష్టిచేత కబ్బిలిరౌతులకున్ను, తుళువరౌతులకున్ను, మొరస రౌతులకున్ను, పండ్రెండు వేల గుర్రాలకున్ను, యేలికబంట్లగా వ్రాయిస్తిమి అని మాటిమాటికి కొనియాడుతా పలకరించి మరి వెనక గుర్రాలు పండ్రెండు వేలున్ను, యేనుగలు యేనూరు, రౌతులు మావటీలు వెచ్చబెట్టి ఆయా గుర్రాల రౌతులకు మావటీలకున్ను సంబళం పారికెలు కట్టడజేశి ఆయాలాయం గుర్రాలకు కడ్డికవళములు పరామరశించేటందు వలుగురు పారుబత్త్యగార్లను ఆరుగురు కరణాలనున్ను పదా

రుగురు అంగజాదులున్ను ఆరుగురు మురుపు గొల్లలున్ను కట్టడజేశి. నానాటి చెల్లుబెల్పానకు కొక్కుపాన యిమ్మనేటట్టుగా నిరుత్తరుపుజేశి నల్ల ప్రజలు లక్షున్ను వెలనెంతు తప్పక సంవిళం దిద్దుమని వాళ్ల కర్ణీకం యేర్పాటుజేశి మరిమెనుక నేరుగదా దొరతనమున్ను ప్రభుత్వమున్ను యేర్పాటు అయును అని సంతసించి, మరిన్ని అమరగార్లకు యేనూరు యేనుగలు, పంద్రెండువేల గుర్రాలున్ను క్రయంగట్టి యిచ్చేటప్పుడు వారలైనా అన్యాయమనకుండా వారువార్ల సమ్మతి మీదనే క్రయంగట్టి యిచ్చిరి గనక ఆ యేనుగుల క్రయం విన్నప్పటికిన్ని సగటున యేనుగ వొక్కంటికి ఆరేశివేల లెక్క యేనుగలు యిరువై యింటికిన్ని లక్ష యిరవై వేల సంతున యేనుగ పుట్టమయ్యాభై యింటికి మూపై లక్షలున్ను గుర్రాల క్రయం గుర్రం వొక్కంటికి యేనూరు వరాల సంతున గుర్రాలు వెయ్యింటికి రెండు లక్షల లెక్కను గుర్రాలు పంద్రెడు వేలకు యిరువై నాలుగు లక్షలున్ను, నిమిషమాత్రములోగా యేనుగ గుర్రాలవల్ల నగరికి ఆ యాభై నాలుగు లక్షలకు ఆదాయం జేసేన.

## సాళువ తిమ్మరసు ప్రశంస

"అపూర్వమైనమనుష్యులు దొరికితేను సకలమున్ను సంతరించ్చ వచ్చును" అని రాయలదేవుండు సలకరించగా అయ్యా మరసుగారు విన్నవం జేశినది—"సింహాసనస్థునకు స్త్రీలున్ను రత్నములున్ను కలిగి నది అయితే అంతకన్నా అధికం మహీపతుల కనగా- నీపతిద్యం.

క. పత్ని ధరిత్రియుఁ బురుషులె
రత్నము లెప్పుడుఁ బురంధ్రిరత్నములు శిలా
రత్నము లవనీపతులకుఁ
బత్నులె రత్నములు నగవ బద్దెనరేంద్రా.

అని అన్నారు గనక రాజులైన వారలు అనువైన పురుష రత్నాన్ని సంతరిస్తే ఆయనా నవరత్నములున్ను చతురంగ బలము

లమున్ను సంతరింప్పగలడు. అటు గనక అప్పాజి సాధారణ నియ్యోగిగా యెంచవద్దు. ఆయన అసాధారణ నియ్యోగి. అఘటనఘటనా సామర్థ్యం ఆయనకే గలదు. అది యేలాగంటేను— అందరున్ను మనుష్యులు. అందరికిన్ని అవయవాలు సరి. ఇందులో ఉత్తములు మధ్యములు అధములు అని యెరిగి యేర్పరచవలెను. అది యేలాగంటేను— గుణాధిక్యము వల్లను యెక్కువ. మరిన్ని పంచలోహములున్ను అన్నియు సరి. అందున బంగారు హెచ్చింది యేంది అంటే వొరియకకు రాంగా వన్నె హెచ్చించినట్లు గుణాధిక్యంవల్ల మనుష్యులలోనున్ను అప్పాజివి అధికుడని యెరుగవలెను. అది యేలాగంటేను—

శ్లో. శతేషుజాయతే శూరః సహస్రేషుచ పండితః,
వక్తాశతసహస్రేషు దాతాభవతి వా నవా.

అనే నీతి ప్రకారానకు నూటికి వక బంటును వెయ్యింటికి వఖ పండితుడున్ను లక్షకు వఖడు వక్తుండై సభాస్థలిని మాటపలుకులాడును. శీమలో వఖడు దాత అనేది కలందో లేదో అన్నట్టు వొఖరు గాక అందరికిన్ని ఆగుణములు యేల వచ్చేని", అని అయ్యా మరసు విన్నపంజేసి ఆప్తాలోచనగా వార్తలాడుతా వుండగా విజయాపురానసుండి వేగర్లు వచ్చినారని మారీచి రామయ్య వచ్చి కృష్ణరాయలవారితోను విన్నవంజేశిన వివరం.

## విజయాపుర వృత్తాంతము

విజయాపురానకు బోయిపట్ణం వెళిపాళ్యములు, కోటకొత్తళములు, రవుతులు, మావుత్తులు, యేనుగ గుర్రాలు, కాల్బలం, అమరనాయకం వార్లను అందరివిన్ని జూచి నగరివాకిటికిపోయి, దాదిమహాలు ముందుగా ముందర దివాణంలో ముందర ఆయావజీర్లు దొరలు దొండో పండితులు మొదలయిన వారు నియ్యోగులు వారివద్ద కుతపనములక వారి హేజీబులు ముకుంద పండితులు మొదలయినవారు కూర్చుండి

ఆలోచన జేశినది:—కర్నాటకం సింహాసనానకు పదవంగా కృష్ణరాయల వారిని అధిష్టాన కర్తల జేశి దారభ్యం తురకల మీద కార్యం శాయవలెనని ఆలోచనజేశి అందుకైన యత్నములు శేస్తావున్నారు. అన్ని వివరాలకు విజయనగరానకుండిన్ని కాకితములు వ్రాశివచ్చెను.

## అశ్వపతి గజపతి నరపతుల తారతమ్యము

అశ్వపతి గజపతి నరపతులలో నరపతిసింహాసనమే అధికము. తరవత రెండు సింహాసనములున్ను వారి వెనకను అని విన్న పెద్దలు ఆలోచనగా చెప్పినందుకు గోలకొండ వారి ముద్దాపండితులు "సింహాసనాలంటె మూడున్ను సరి. ఇందులో సింహాసనాధిక్యములు కలవా" అని ఆగ్రహపడగా నిజాం రవుతులు మావుత్తులు లశికరీలవాస నరిగదా ద్రవ్యసామగ్రియందు దుర్గముల యందు కొదవ, అట్టి పట్ల అధికమని జెప్పవలశిన కారణమెంద్ది. అన్నందులకు గోలకొండవారి ముద్దాపండితులు వ్యంగ్యోక్తముగా కాక యేమి మరేమి యిందులలో న్యూనాధిక్యములు యెంచ అవకాశమేమివున్నది? వొకరికొకరు ఏకవాక్యముగా ఆడుకొన్నందులకు బాహుబలేంద్రునివారి బ్రంహ్మపంత్తులు వారలతోను యీమూడు సింహాసనము లనగా బ్రంహ్మ విష్ణు మహేశ్వరుల అంశలుగా వుండును. అందున తారతమ్యములు యేరీతో ఆరీతు వలెనే అశ్వపతి గుర్రాలకున్ను, గజపతి యేనుగలకున్ను, నరపతి కర్నాటక సింహాసనానకున్ను గనక నరపతియే హెచ్చు, అని యేలాగంటేను — భగవద్వాక్యం 'నరాణాంచ నరాధిపం' అనే వచనము వల్లనున్ను ఆ రాజ్యములోను దేవాలాయం బ్రంహ్మాదాయం పుణ్యతీర్థములు నదులు పుష్కరుణులు గలిగి వున్నది, ఇదిగాక విష్ణుప్రత్యక్షమై వెంకటాచలాన వున్నారు, ఆ రాజ్యములో వుండే స్వామికి కడమ రాజ్యములో పెద్దలు బుద్ధిశాలులు బ్రాంహ్మలు యతీశ్వరులు మఠాధిపతులు రాజులు మొదలైన వారలందరున్ను కామక కష్టములు కొంచు

బోయి స్వామికి సమర్పించి వస్తావున్నారు గనక కర్నాటకం సింహ్మాసనాధిపతులు పుణ్యశ్లోకులు, ఆ పిమ్మట గజపతి సింహ్మాసనమందు జగన్నాయకులు వేంచేశి వున్నారు గనక రెండోపర్యాయము అశ్వపతి వారున్ను గంగాతీరాన విశ్వనాధుల రాజ్యములో వున్నారు, వారి తెగల వారి యెదులసాహు, కుతుపసిమలక, నిజాంశాహు, యీ మూడు తెగల వారున్ను కర్నాటకం సరదున వున్నారు. మీరు కర్నాటకాధిపతులతో సరి యన నగునె, అని మధ్యస్థభావముగా అన్నందులకు దొండో పండితులు, ముద్దో పండితులు, దాదో పండితులు ముగ్గురున్ను దొడ్డ నియ్యోగులు గనక తెలుసుకొని తమ దొరలు మద్యపానులు దేవబ్రాంహ్మణ విశ్వాసము లేదు. మ్లేచ్ఛులు గోహింసకులు, వారిని గొలిచిన వారము గనక దూరదృష్టి విచారించుకొని అవకాశ మంత లేక అహంకార గుణమువల్ల అనవలశిన దంటిమి. బ్రంహ్మపంతులవారు పలకరించినది యదార్ధ మని యెంచినవారై ఆ తర్వాత మంత్రాలోచనగా వార్త లాడినవి. కర్నాటకం వారు సరదు బలమించ్చి వచ్చే గజపతి వారికిన్ని మనకున్ను మున్నెరికగా వుండగా వుండును. ఆ రీతు గాకుండ అందుకైన యత్నంగని సరదు దుర్గాలను రస్తుసామగ్రీలు వేయించి బలపంతముగా యేనుగ గుర్రాలు కాల్బలములు వుంచవలెను అని ఆలోచన జేశినవారై యెదుల శాహువారితోను యీ పర్యాయములు యెరుకశాయగా అగ్రహించి "కర్నాటకం వారు తుంగభద్ర దాటి వచ్చిరా యీవరకున్ను యీశ్వరనాయకుండున్ను నరసనాయకుండున్ను వీరనరసింహ్మరాయలవారున్ను యేలినందు కన్నా కృష్ణరాయలవారు యేలేది యేమున్నది" అని అన్నందులకు ధోండో పండితులు మొదలైనవారు "రాజనీతి అది మొనకు రాదు. గనక వుండే యత్నములు వుండగా దైవసహాయం యేతీరో తెలియదు గనక నిజాం శాహువారున్ను, కుతుపసమలకవారున్ను విజయనగరాన నుండి కాకితములు వ్రాసి వచ్చినది నిని ఆలోచనపరులై యిక్కడికి కాకితములు అంపి తమతమ సరదు స్థలములు పదిలపరుచుకొని యాది హెచ్చరికలతో

వున్నారు, బాహుబలేంద్రునివారి బ్రంహ్మణ్యపంతులువారి వారి వరకు గిరి దుర్గములయందు రస్తుసామగ్రీలు వేయించి బలవంతముగా వుండేటట్టుగా యేనుగ గుర్రాలున్ను, రవుతున్ను అంపించేవారై వున్నారు. మన మున్ను ఇక్కేరి బసవాపట్టం శంకరనాయుడు అదికొమాళ్ల బోయి రామప్పగారి వరకు స్థలాలకున్ను రస్తుసామగ్రీలున్ను మూకసైన్యాదులున్ను అంపించవలెనో నవగా ఆ తీరున్నె అంప్పించ మని విజయాపురం కోట కొత్తళములున్ను లెస్సగా తీర్చి రస్తుసామగ్రీలు వేయించమని మందలించగా, వాకిటి పారుపత్యగార్లు యెనిమిది దివాణమంతిన్ని ఫిరంగి, జబురు జంగులు, గుంట్టుకోవులు, దంతెన రాళ్ళు, యెత్తురాళ్ళు, గళికలు, పులితలలు, కోట వెలుపట గుర్రాలు తొచ్చిరాకుండా గుర్రపు విలుపు రాళ్ళు, వేయించేదిన్ని, దిక్కులకు వేగుర్లను అంప్పి నానాటి సమాచారములు తోడుతోనే వచ్చి తమతో చెలుప మని అరసై వేగుర్లను విద్యానగరపట్టానకు అంపించినారు విజయాపుర దేశములో గల ప్రజ లందరున్ను ఆలోచనపరులై వున్నారు. సరుదుల ఉండేవార్లు యీవార్త విని చీటిపాటి చిక్కు చిల్వానములు విజయాపురానకు అంపుతావున్నారు, అనిన్ని ఆపట్టములో వారువారు ఆడుకొనే వార్తలున్ను కన్న విన్నది యంతాను విన్నపము శేయగా, రాయలవారున్ను అప్పాజి అయ్యమరసు కొండమర్సుగారు విని, విజయాపురం అహముదానగరం గోలకొండ వారికి యిక్కడ వుండే వారి స్థానాపతులు నడిచిన ప్రవర్తమానములకు వ్రాశి అంప్పిన కార్యానికి యాది హెచ్చరికలు కలిగి, యింత ఆలోచనశేశి యదులశాహంకున్ను తెలిపి అయనాను సరుహుస్థలాలకు రస్తుసామగ్రీలు అంప్పించినారు గనుక వారి యాది హెచ్చరికలున్ను కలిమిబలుములకున్ను నరి వున్నందా అని వేగుల వారికి వుడుగరల యిచ్చి విజయాపురాన్నె వుండి నానాటివర్తమానములున్ను లెస్సగా తెలిసిరమ్మని అంపి, వర్ధమన్న వూడిగాలవార్లను కడకు పొమ్మని అప్పాజి మొదలైన సామాజికులున్ను రాయలవారున్ను ఆలోచనగా మాటలాడుకొన్న వివరం:— రాయలవారు అప్పాజి మొదలైన వారి తోను "మేము ఏక

దేశాన ఏకవదంతిగా తురకాణ్యంమీద కార్యం శేయవలెనని యెంచిన ఆలోచనకు యిప్పుడే నడిపిస్తా వున్నారు. యీకార్యం ధైర్యంమీద నడిపేదో భీతిచేత హెచ్చరికపడేదో" అని అడిగినందులకు అప్పాజీ ప్రభృతులైనవారు దిక్కులవార్తల విందును, విన్న వేళకు ఆ ప్రసంగములు తలపక నాలుగార్లు దినములు వెనుక సరుదు స్థలాలు చూచేనిమిత్యముగా ఆశీమాధిపతి వస్తున్నాడని వదంతి పుట్టించి ఆయా స్థలముల వుండేవారికి కోటకొత్తళములున్ను రస్తుసామగ్రీలున్ను వైచి యాది హెచ్చరికలతో వుండవలెనని సమదళం వారు సంతరించేటట్టు నడిపించేది గంహరమున్ను ధైర్యమున్నుగాక యీరీతి నడిపించేదెల్లా బుద్ధి చంచలత్వాన నడిపించే ప్రయోజన మని అన్నందులకు, అయ్యమరసు కొండమరసుగారు తురక లనగా మద్యపాయులు, మందుతినేవారు,

## తురుష్కుల శీలము

లాలారిపురుషులు గనక వార్లకు చాలా భీతి గలిగి యుండును. పానము జేసినంత పొద్దున్ను తమ దేహములు తాము యెరుగరు గనుక ఆసమయమందు స్మరణ యెరుగరు. అప్పుడు యెవ్వరు అడ్డమైన నరుకుదురు. కలియుగరాక్షసుల తీర్లై వుందురు. స్మరణ తెలిశిన తర్వాత తమ జాతి స్వభావం యిటువలెగదా అని విచారపడుదురు. బ్రాహ్మలు వుప్పు పులుసుతో అన్నం ప్రిపాపడుదురు గనక వారలకు మదమాత్సర్యములు లేవు. అని యెంచి వాకిటిపారుపత్యమంతా వారినే శేయమని తమ ఆజ్ఞలో నడుపక వారి మాట మీద నామజాదులు అంపుతా వారు తీశి పెచ్చేటట్టు యేర్పాటుచేసి తామున్ను వారి బుద్ధిమతులలో నడుచుక వత్తురు. అటుగనుక నియ్యోగులు యేరీతిని నడిపిస్తే ఆరీతున నడుచును. నియ్యోగులతో ద్వివిధమైతే దొరనుండి తమ ప్రాణాలకు హానియై దొరతనమునకున్ను చలనం వచ్చును, అటుగనక యేకగ్రీవమై ఆ మూడు తెగల నియ్యోగులున్ను ఆలోచన శేసుక నడిపించే కార్య

మని తెలిపి "వారు స్వాయత్తులు గారు, పరాయత్తులుగాని స్వామివారు ఉభయాయత్తులు కాబట్టి దేవరవారి ఆలోచనకు సరిలేదు. తురకల మూడు తెగలవారున్ను యేకాలోచనపరులై కార్యముఖానకు నడిపిస్తే లక్షయాభై వేల గుర్రాలున్ను వెయ్యింన్నూరు మదహత్తులున్ను మూడు లక్షలపాయాదళములున్ను వార్లను జయించేటందుకు అంతకన్నా ద్విగుణమైన బలముచేత జయించవలెను; కర్నాటకాన అన్ని గుర్రములున్ను సంతరించేమా కాదు. చతురంగబలాలున్ను వుండవలెననేటందులకు కైజీతం గుర్రాలు పన్నెండువేలున్ను, అమరనాయకం గుర్రాలు యిరువై నాలుగువేలున్ను, కైజీతం యేనుగులు యాభైపట్టాలున్ను, అమరపు యేనుగలు మూటయిరువై పట్టాలు, కైజీతం రాణువ సాతసం సహాగా మూడులక్షలున్ను, అమరం సగను అయిదులక్షలున్ను, బలం బంట్లున్ను యీ మట్టుబలముతోనున్ను వివరం మీద సమరమిస్తేను తురకల కార్యమనగా యెంత" అని విన్నపం చేయగా రాయలవారు సామాజికుల లోను ధైర్యమువల్లనున్ను లక్ష్మీకటాక్షమువల్లనున్ను దైవసహాయము వల్లనున్ను జయంగలుగును, అందుకు—

శ్లో॥ యతో ధైర్య స్తతో లక్ష్మీః యతో లక్ష్మీ స్తతో హరిః
యతో హరి స్తతో ధర్మః యతో ధర్మ స్తతో జయః॥

అని పెద్దలు చెప్పుదురు గనక అన్నిటికన్ని ధైర్యము ముఖ్యముగనక మీరు ధైర్యశాలులు మీరు పూనిన కార్యము లన్నివిన్ని చేకూడును. యేనుగలున్ను గుర్రాలున్ను కాల్బలమున్ను కారణం గాదు. దైవ సహాయమువల్లనే రాజ్యములు దీవులు పరిపాలించవలెను. తొల్లి ఆర్గుప చక్రవర్తులు తాము వున్న తావున్నె వుండిగదా ఆజ్ఞాచక్రము చేత సప్తద్వీపములున్ను యేలిరి. ఆ పిమ్మట పదార్గురు రాజులున్ను భూమి పరిపాలించిరి. ఆరీతినే స్వామివారికి వేంకటేశ్వరుల సహాయం గలదు" అని తెలుపగా విన్నవారై "ముందరి కార్యాలోచనకు అనుసారిగా

నడిపించుడా" అని అప్పాజీ మొదలైనవారితో ఆనతిచ్చి ఆయా దిక్కుల నుంచి వేగర్లు కమ్మ కాకితములు తెచ్చినారా అని పరామర్శించగా అహముదా నగరానుండ్డిన్ని వేగుల రామున్ను గోలకొండనుండ్డిన్ని వేగుల గోపాలున్ను వచ్చినారని తెలుపగా వద్దనున్న వార్లను కడకు పంపించి వేగర్లను రప్పించుక అప్పటి సమాచారములు అడుగగా వారు విజయనగరమున నుండిన్ని తరలిన దారభ్యం అహముదానగరం గోల

## అహమదాబాదు గోలకొండల వృత్తాంతము

## పరదేశుల శోధనము

కొండ ప్రవేశమయ్యేపర్యంత్యం నిత్యపయనగతుల వూళ్లున్ను పట్టణములున్ను దాటి ఆయానదులున్ను పరస్థలం శీమవారినిన్ని పరదేసులనున్ను మరిన్ని మార్గస్థులుగా వచ్చేవారినిన్ని శోధించేదిన్ని కమ్మకాకితములు లేనివార్లను యెక్కడి నుండి వస్తున్నావు, యెవరి తెగల వారు అని బెదరించి అడిగేదిన్ని, ఆ తర్వాత పొమ్మనేదిన్ని, ఆపట్ణంలోనికి పోయి వెలిపాళ్యములు జూచి కోటలోనికి పొయ్యేటప్పుడు యెరుకగల వారు వచ్చి వీరు తమ వారనిన్ని వీరినుండి వక కార్యములు వస్తే మేమే నేరస్తులమనిన్ని భరవసముగా చెప్పిన తర్వాత శిఖామీద శిఖా వేసి కోటలోపలికి అంపుదురు. కడమ జనులవారికి ఆ శిఖా జూపితేను కోటలోనికి విడుతురు కొత్తవాలు అనే తలారికి ఆ ముద్రజూపి పట్ణములో సంచరించవలెను. కోటలో వుండే దినాలెల్లా తిరిగి తమ శీమకు వచ్చేటప్పుడు మొదటి పారుబత్యగానితో యెరుకజేసి పారుబత్యగాని శిఖా చేతికిచ్చి శిఖా వేయించుకొని కొత్తవాలు అనే తలారకి జూపి కోట వాకిళ్లకు వచ్చి వాకిటివార్లకున్ను ఆముద్రజూపిన తర్వాత అంపుదురు. అటువంటి దుర్ఘటనముల నన్నిన్ని నేర్పున గడచి దివాణం ముందర

## తురుష్కరాజ్యముల దండన విధము

దిన మొక్కంటికి అజ్ఞలు జేశేదిన్ని నడిమికి తెగవేశేదిన్ని, రంపాన

మనుష్యుల గోనెదిన్ని, గోనెలో మనుష్యుల పేసిగట్టి యినుపగుడియల గొట్టేదిన్ని, చౌలకు కింగ్గాణికావలవారుల తగిలించేదిన్ని, రెండుతులాల బరువుగల రాళ్ళు కాళ్ళకుగట్టి పాదుగోడలకు యినుపగడల దిగవేశేదిన్ని, మూటకట్లుగా కట్టి యెండలో దొర్లించేదిన్ని, కాలు చేయి కర్ణనాశిక ఛేదనం జేశేదిన్ని, ఇదిగాక శివ మణియగార్లను అనేకవిధముగా బాధలు బెట్టేదిన్ని; యేనుగ కాలగట్టి దొర్లించేదిన్ని, యీరీతిగా అనేకవిధములుగా చూడ భీకరమైన బాధలకు వెరచి నగరికి హైకం ఇస్తె ప్రాణాలతో విడుతురు. యిచ్చేటందుకు అవకాశం లేకుంటే హింసచేతనే నడివీధిలోనే చంపుదురు. యీరీతి యీ..ఎట్టి బాధలు చూస్తూవుండి వెంబడినే అయాధిపత్యము నగరి మహాయిమ ముందర యెదురుగానె కట్టివుందురు. గనక అందుర్కి అయాచావిళ్ళవారు సలాము శేయింగ్గా మొదటిదొర పితపరిజనములతో మహాబుమిని కొలువైయుండ్డి కొలువుదీరి నగరికి హొయ్యేటప్పుడు వున్నతమైన మార్గముగానె కట్టివుండ్డును గనక ఆవున్నతస్థానమందు నిలిచి వెలిచావళ్ళలో వుండేవార్లజనం జూచి వారివార్లజనకు నిత్యకట్టడ బహుమానము వస్త్రావంబులు నడిపించ్చే క్రమానికి నడిపించ్చేమని ఉత్తమవు ఇయ్యకగానె అయాపనులవారు లొత్కాంవుడుగరలు దట్టికబాయి తలపాగ పట్టెలు యివి అన్నింన్ని అయాచావిళ్ళలోనే వుండ్డును గనక తోడుతోనె తెచ్చి మొదటిదొర ముంద్దుగానె వారివార్లకు ఇయ్యగా సకలమైన వార్లున్ను కొలువుజేశి వుండ్డురు గనుక యెంద్దరు వచ్చినా వార్లజనకు గ్రామం కట్టడజేశి వుండ్డును గనక వారలకు గ్రామం యిప్పించ్చి మరి వెనక నగళ్ళోనికి పోదురు నియోగులు దిక్కులమండ్డి వచ్చిన కమ్మకాగితములు చదివింమ్చుక నిని యేనుగలున్ను కొంత్తపాయదళమున్ను నామజాదులు ఆలోచనశేయగా విన్నవివరం:- విజయాపురం ఆహముదానగరం గోలకొండ్డమీద కార్యం శేయ మని మూడులక్షల గుఱ్ఱాలున్ను వెయ్యి యేనుగలున్ను కొంత్త పాయదళమున్ను నామజాదుల జేశినారు వారువచ్చి దిగితే వారలతో పోరాడేది దుర్ఘటమై వుండ్డును. ఉత్తరాన

ఆఘుపురం వారున్ను దక్షిణాన కర్నాటకం వారున్ను తూర్పున గజపతివారున్ను కనిపించుకొనేటట్టు వున్నది. అశ్వపతి గజపతి నరపతులలో యీమూడు సింహాసనాలవారిన్ని విరుద్ధమైనవాగి యెవ్వరినిన్ని కనమని కొలిచేవారము కాము. మూడు సింహాసనములకున్ను గురిలేక వుండ్డగాను మూడుతెగల రాజ్యములోను యేలుబడియైన గడిస్థలాలు ఆక్రమించ్చుకొని మెదలిమిని దినాలు క్రమిస్తావుంట్టిమి. వారితోవారు అన్యోన్యమై కార్యం శేయమని తమ తమ పరదులవుండ్డె వాల్లను కనుపించ్చుకొమ్మని నామజాదులు అంప్పితే వారితో పోరాడేది శక్యము గాదు తాము జేసిన అదృష్టమువల్లనున్ను తమ దొరల పాలిటి కర్తారు వల్లనున్ను అంత్తరమన్నీలమై అసమై యేండ్లుబట్టిన్ని, అవనికి అధిపతులు లేకుండ్డగ యెదులశాహా కుతుపనమలక నిజాంశాహా అనేపేరు గలిగి వుంన్నది. సింధు దేశము నుండి గోదావరీ పర్యంతమున్ను

## మూఁడు దక్షిణ హిందూరాజ్యములు

ఆఘుపురంవారున్ను కేరళం మొదలు కృష్ణవేణిపర్యంతమును కర్నాటకం వారున్ను జగన్నాధమున నుండి బెడదకోట పర్యంత్తం గజపతి వారున్ను యేలుదురు. యీమూడు సింహాసనాలవారికి అంద్దుబడిగాక అసాధ్యమైన దుర్గాలున్ను చేపట్టి త్రిపురాలవలె వుంన్నది గనక భయము లేదని తమలో తాము ఆలోచన జేసుకవుండ్డంగా తాత్కాలికమతి అనే ఆయన వారితోను మీరు జేసిన ఆలోచన యథార్థమౌను త్రిపురాలలోనున్న రాక్షసులు మహాబలవంత్తులు యీశ్వరవరప్రసాదము వల్ల కామగమనం గలిగి సురులు అసురులు మొదలైన వారలచేత వొక్కరిచేత వయినా లయం లేకుండ్డా వరమడుక్కొని పంన్రెండ్డు యేండ్లకు వొకపారి మూడుం ముక్కాలుఘడియ త్రిపురులు ముగ్గురున్ను కూడివుండ్డి ఆలోచన జేసుకొని యెప్పటివలె యథాయథలై సంచరింపుదురు. అటువంటి త్రిపురాధిపతులకు కాలం కూడేటప్పుడు భూదేవి బ్రహ్మదేవునితోను విష్ణుదేవునితోనున్ను అధర్మపతులైన త్రిపురులను

మోయలేనని మొరబెట్టగా బ్రహ్మదేవుడు త్రిపురాలవారిని నకరివేళ విగ్రహించ శక్యముగాదు, నీవు రథమై వేదములు గుఱ్ఱాలై మేరుపర్వతము విల్లై. ఆదిశేషుడు నారియై క్షీరాబ్ధిశాయి నారాయణాస్త్రమై ఫాలలోచనుఁడు రథికుండై త్రిపురాలను నేల గూలిస్తే అప్పుడు ఆ దానవులు నాశమై పోవుదురని అనుగ్రహించిరి. ఆరీతిగాను విజయాపురం అహమ్మదానగరం గోలకొండ్డ అనే త్రిపురాలకు మూడు సింహాసనాలవారున్ను యెప్పుడు కనిపించుకొంటా వున్నారో అప్పుడు అపాయం వచ్చేది నిశ్చయమని తాత్కాలికమతి తెలుపగా ఆ నియోగులు అందరున్ను "అనీతు అవును అయినా పుంన్నదినాలకు రాజలక్షణములున్న మంత్రాలోచనలున్న నడపవలె గనక వూరకే వుండరాదు యిప్పుడు కర్ణాటక సింహాసనానకు కృష్ణరాయలవారిని అధిష్ఠానకర్తల జేసినదారభ్యం తురకలమీద కార్యంజేశే ఆలోచన అక్కడనుండే ముఖాములు కాకితములు అంప్పినారు. అది నిమిత్యం ఆలోచనపరులై హానివృద్ధులకు లోనై యెదులపాహావారికి వ్రాయించ్చి అంప్పించినారుగనక వారున్ను తమతమ కాగితములు నరదుస్థలాలకు రస్తుసామగ్రీలు అంప్పించి గడిస్థలాలకు బలవంతముగా వుండ్డేటట్టుగా ఠాణ్యములకు నామజాదులు అంప్పించి మొదటి స్థలానికిన్ని యాదిహెచ్చరికలతో వున్నారని వ్రాశి వచ్చెను. మన రెండు తెగలవారున్ను శీమనరుదులు వున్న దుర్గములు కోటస్థలములకు అంప్పతగినవార్లను అంప్పించి కర్ణాటకంవారు దళము కూర్చుకొని స్థళము తర్లి నరుదులకు వచ్చేవారై నక్కప్రదేశాన దిగినారని కమ్మకాగితములు వస్తే యిప్పుడు అందుకు తగిన ఆలోచన జేశి నడిపించ్చుకొండ్దాము. ఇప్పుడు నా నాటి ప్రవర్తకములు తెలిశివచ్చి చెప్పమని నూటయిరునై వేగుల్లను నయినంశేశి అహమ్మదానగరం వారున్ను గోలకొండ్డ వారున్ను అంప్పగా విద్యానగరానకు బహువేషభాషల బహురూపాలుగా వచ్చి వారు వేగుల్లను అంప్పించి మరిన్ని ఆలోచనశేశేవివరం- కృష్ణరాయలవారు తురకారణ్యం మీద దళమెత్తి వచ్చి అనిమొనల కార్యం పూని నడిపించే యడల జయాపజయముల

రాయవాచకము

యెవరికని దైవజ్ఞులయిన బ్రాంహ్మలనున్ను ముల్లాశాస్త్ర ప్రవీణులయిన పకీ౯రులనున్ను భూత భవిష్య ద్వర్తమానములు తెలిశిన శకునజ్ఞులనున్ను పిలుపించ్చి అడుగగా వాల్లు కన్నా౯టకమున విష్ణు అంశగా నృపతి ఉద్భవించి యీ రాజ్యమున్ను అశ్వపతి రాజ్యమున్ను గజపతి రాజ్యమున్ను అంత్తా జయించి జయస్తంభము వేయించ్చి మగుడి బొయ్యేటప్పుడు కల్యాణ వేంకటేశ్వరుల దశి౯ంచ్చి మూటయెనిమిది దివ్య తిరుపతులమున్ను డెబ్భైరెండ్డు దేవస్థానములున్ను పదునెనిమిది శక్తులమున్ను సేవించ్చి సేతువుకుబోయి రామనాధుల దశి౯ంచ్చి ధనుష్కోటిలో ఖడ్గము కడిగి కన్నా౯టకం సింహాసనాన అసపై నాలుగు యేండ్లు యెదురులేక యేకచక్రముగాను రాజ్యమేలేటట్టు వున్నది అని చెప్పినారు గనుక పిన్న పెద్దలు అతిరే అఫ్గానోలు మ్లేఛులు అధర్మాసకున్ను నిర్దయత్వమునకున్ను రాక్షసకృత్యమునకున్ను వెరవరు గనక భూదేవి తాళునా, త్రిపురాలకు వచ్చినట్టు వచ్చునేమో తెలియదు అని అంద్దరున్ను ఆలోచన శేసుక తమ తమ ఇండ్లకు పోగా వారితో కూడావుండ్డి నగరు వెడలి పకీ౯రులతోకూడా పట్ణము వెళ్లివచ్చి భాగిరధినుండ్డిన్ని రామధనుష్కోటికి వచ్చి వచ్చేవారి వెంబ్బడి నీళ్లుదాటి కన్నా౯టకమునకు వచ్చి యెప్పటి వేషముదాల్చి బట్ణమునకు వస్తిమి. అహమ్మదానగరం గోలకొండ్డలో కన్న విన్న వాత౯లు వేగుల అరవరాయుడున్ను పకీ౯రి గోపోజి యిద్దరు తెలియ విన్నపము శేయగా రాయలవారితోను అప్పాజి అయ్యమరసు కొండమరసుగారున్ను తురకారణ్య మనగా యెముని రాజ్యమువంట్టిది ఆ పట్ణము అటువంట్టిది ఆ వూరిలో వుండ్డేవారు యమదూతలు అనేటంద్దులకు సంద్దేహంలేదు అటువంట్టి దిక్కులకు బోయి సకలవాత౯లున్ను పరామరిక శేసుక స్వామివారి ప్రతాపమువల్ల మ్లేఛులయినవారి నగళ్ళున్ను రాజ్యములున్ను నూరుభాషల భూములున్ను మహారాష్ట్రి గుజ్జెర్రి గజ్జోజి యిటువంట్టి గాయకులతో కలహస్థులై కష్టబడక సంచ్చరించ్చి పట్ణానకు వచ్చినారంత్తేగాని అరపేద కాలుపేద మనుష్యులయిన వారికి పోనరాను శక్యమా అని నగరు వేగులవారు

కొనియాడగా రాయలవారు చాలా సంతోషభరితులై యేమాకేశిపట్లున్ను ఉడుగరలు యిచ్చి యెప్పటివలెనే ఆయావస్థముల సంస్కరించి వారి సమాచారములువచ్చి వింన్నవంశాయమని అంప్పించ్చి వద్దనున్న వాల్లకు సరకు పొంమ్మని రాయలవారు ప్రధానులతో విజయాపురం పతకాషా నాలున్ను అహమ్మదానగరం గోలకొండ్డవార్తలున్ను వింటిరేగా ఆ రెండ్డు ఇండ్ల వారికింన్ని చాలా ఆలోచనపుట్టి యింత్తే శివార్త్తలకుహేతువు యెంద్ది అది అడుగగా ప్రధానులు యీ వరకున్ను తురకాణ్యాము మీద కార్యం శేయవలెనని వదంత్తి పుట్టింద్ది లేదు గనక యీ సింహా సనస్థలనుండి విచారం లేక వుండ్డిగా వూరకె వుండ్డిరి యిప్పుడు స్వామి వారు సింహాసనానకు కర్త్తలై దానశాత్రములు కనుపింన్చి వార్త్త లుగా అనతిస్తిరి గనక అరిజనులైనవాల్లకు ఆలోచన పుట్టకవుండ్డునా మీరు దినమున్ను ఆ మూడు తెగలవారి ముఖాములలోను వినియమైన వార్త్తలు ఆనతిస్తేను వారు బుద్ధిశాలులు గనక తమ యేలిన వారిని స్వామివారవింన్ని అట్టి పట్టణాన సింహాసనస్థులైనవారు శేశినసంత్సరం పారికెలు యిప్పించ్చి దిక్కుల స్థానాపతులతోడట్టు కొలుపుకువస్తే కమ్మ తాకితములు గలిగితేను మాట పలుకులు నడిపింన్చినట్టయితే ఇప్పుడున్ను నడుచుకవచ్చే మర్యాద వక్కలాకులు యిచ్చి అంప్పుదురు. ఆరీతిగ స్వామివారు పట్టాభిషిక్తులైన దారభ్యం నిలిచిన వారి కేమి రౌతురాణువ కేమి బొక్కసానవే రొక్కరూపాయలు ఇమ్మని కట్టడజేశి కైజీతం నిలిపి గతం అమరపు దొరతనములవారి శీమ సంబంధ్ధాలున్ను నడిపి నగరి నియ్యోగులకు వరస్థలం నియ్యోగులకు బహుమాన సంమ్మాన ములున్ను ఉచితముగా రొక్కరూపాయిలున్ను యిచ్చి మూడు తెగల వారివల్ల ప్రియ్యమైన మాటలున్ను ఆడుతా ఉన్నారు గాబట్టి ఆ మూడు తెగల నియ్యోగులున్ను కర్న్నాటకాంన్ని బహుదినాలుగా వుంన్నారు యిదిగాక వాల్లు నీతిప్రబంధములు చదివి వుండ్డురు కాబట్టి ఆలోచన పరులై వ్రాశి అంప్పింన్చినారు అనిసంద్దులకు రాయలవారు మేము ఆగ్రహించి ఆ రీతిని యీ రీతిని ఆనతిచ్చినవారముగాము వారికి వారి

యేలినవారి మర్యాదగా బహుమాన సన్మానములుగా వినయమైన సరస సల్లాపములుగా అండ్డుము అని వండ్డులకు అయ్యమరసు స్వామివారు వినయపూర్వకముగా యెప్పుడు అనతిచ్చినారో అదే విపరీతమని యెంచ్చ వచ్చును ఆదెట్లంటిరా అండ్డుకు నీతిపద్యం.

క. ఘనుఁడా వినయం బాడిన
వినయంబా మీఁద నదియు విపరీత మగుం
గొనమండి విల్లు వంగుట
వినయంబా యెదుటివాని వేగమె త్రుంచుఁ.

అనే అర్థము గనక కన్న కార్యములున్ను విన్న వార్తలున్ను హృదయాలోచన అనుమానముగానున్న నియ్యోగులు వ్రాసేది చాణుక్య నీతి గనక ఆ రీతిని వ్రాతురు అక్కడివారు ఆ కాకితములు జూచుక ఆ వార్త ఆలోచన నడపతగినదే ఆ వర్తలు పరిశోధించి చెప్పినారని సామాజికులు విన్నపం శేశినారు గనక మనముంద్దర నడిపించ్చే కార్యములకు హేతువుతోస్తుంన్నది అని పలుకరించ్చి అప్పాజీ మొదలయిన వారిఁ అంప్పించుకో వచ్చిన తర్వాత అయ్యసమలక అంకుశఖామంద్దు రాణాజగదేవు గణుతి తిమ్మప్పనాయడు రాచూరి రామినాయడ్డు పెమ్మసాని రామలింగమనాయడు హంద్దే మల్లారావు బోయి రామప్పహారి వాణం కొమాళ్ళయిన పదునెనిమిది కప్పణాలవారున్ను దళనాయకులు అప్పరపిళ్ళ తుప్పరపిళ్ళ సాళువనాయడు కొమార తిమ్మప్ప సంగ్గరాజు చెర్వ్వప్రధాని తిప్పరస అయ్యప్పనాయడు కొటకం విశ్వనాథనాయడు చెవ్వప్ప నాయడు అక్కప్ప నాయడు కృష్ణప్పనాయడు వెలిగోటి యాచమనాయడు కన్నడ బసవప్పనాయడు సాళువ మేకరాజు మట్ల అనంతరాజు తిమ్మరాజు వీరమరాజు మొదలయిన వారుంన్ను బొంమ్మిరెడ్డి నాగారెడ్డి బసవారెడ్డి మొదలయిన రెడ్డి కొమాళ్ళుంన్ను కమ్మనాయకులు పెతలప్పనాయడు అల్లుండ్లు కొమాళ్ళు రాచరికం మొదలైన

అమరనాయకం వాళ్లుగాన్ను రక్షించ్చి వారి వారి యోగక్షేమాదులు అడిగి మీవద్ద యేనుగ గుఱ్ఱాలు బంట్లు పరిజనాలు యెంత్త వున్నదని అడిగినందులకు వితలమ్న నాయనిస్థానాపతులున్ను పరశురామనాయనికి తెగాను అమరగాళ్లు స్థానాపతులలో వీరభద్రయ్య అనే ఆయనాను దళపతి రాయడున్ను రాయలవారితోను స్వామివారు కైజీతం కట్టిన మెనక అమరపుశిమంకు నగరి లెక్కలప్రకారానకు కుంద్దకం లేకుండా వారు వాళ్లు యేనుగ గుఱ్ఱాలు రావుత్తులు మావుత్తులు బంట్లు పరిజనములున్ను సంత్తరించ్చినారు యిన్నాళ్ళవలె కాదు స్వామి వారు యేవ్వేళ రాచకార్యానకు ఉద్యుక్తులై కదులుదురు అనిన్ని చిత్తం వచ్చినప్పుడు గణితిబెట్ట కరణీకులకు ఉత్తరవు యిచ్చి వారువచ్చి గణితిపెట్టినప్పటికిన్ని నగరి లెక్కకన్న సదేశి యేనుగలున్ను మారేశి గుఱ్ఱాలున్ను వెయ్యి మనిషి బంట్లున్ను అధికముగా వుండవలెనని సంత్తసించ్చినారు. స్వామి వారి సొమ్ము ఇన్నాళ్లు ప్రసాదించ్దుకు నగరి అవసరకార్యలకు చిత్తం రా నడిచే వారై యున్నారు—అని విన్నపం శేశినంద్దులకు రాయలవారు బాలా సంతోషసములై అమరగార్లతోను విండ్డుకొలువై వుండ్డగా అయ్యవమలక అంకుశరావుతోను మీరు విజయాపురాన బహుదినాలు వుంట్టిరి గనక యెదులసాహవారి దొరతనముకన్న మీ దొరతనం పూర్వమైనది అని విండ్డుము వారి పూర్వోత్తరములున్ను నిజాంశాహ కుతుపనమలక వారి వర్త్తన మానములున్ను మీరు దెలిశి వుండ్డును గనక వీరలకు దొరతనం వచ్చేదేరీతు అని అడిగినంధ్దులకు అయ్యవమలక రాయలదేవునితోను విన్నవం శేశిన వివరం_ అశ్వపతి గజపతి నరపతి యీ మూడు సింహాసనాలకు గల రాజ్యములో ఢిల్లి సురధాణికిన్ని వోరగంటి ప్రతాపరుద్రునికిన్ని గాక పదిహేను సంవ్వత్సర[illegible]లు పోరాడెను అంతట దుర్గాలలోనున్ను కోటలోనున్ను రస్తుసాను [illegible]లు నరిపోయగనక ప్రతాపరుద్రుండ్డు ప్రజలను పూరకే సంస్పేది ధర్మ[illegible]దని వెలుబడి సమరం శేయగా దైవగతిని ఢిల్లి సురధాణికా తను [illegible]తాపరుద్రుండ్డు తగిలెను గనక జయభేరి వేయించ్చి ఢిల్లికి

## ఢిల్లిలోనున్న ప్రతాపరుద్రుని వృత్తాంతము

కొంచ్చుపాయనని అనమాచారము విని సురథాణితల్లిగారు ప్రతాపరుద్రుణ్ణి చూడవలెనని కొడుకున అడుగగా అయన పోఖనాడు నిద్రహొయ్యే టప్పుడు చూడమని చెప్పినాడు గనక ఆ తీరుంన్నే ఆయమ్మ రాత్రివేళ నిద్రహొయ్యే సమయాన వోరగంట్టి ప్రతాపరుద్రుండ్డు మనుష్యశక్తిగాదు సిద్రాంశ త్రిశూల డమరులతోడట్టు వున్నాడు అటువంట్టి రాజును నీవుపట్టుకరావచ్చునా అని అన్నందులకు సురథాణి నవ్వి ప్రతాపరుద్రుండ్డు నిద్రబోగా చూస్తే మీకు యీశ్వరాంశమై కనుపట్టెగదా నేను నిద్ర హొయ్యేటప్పుడు చూడుమూ అని చెప్పి అంప్పె గనక ఆ తెరంగ్గునవె సురథాణి నిద్రహొయ్యేటప్పుడు చూడంగా శేషశాయిగా శంఖచక్రగదా యూధములతో లక్ష్మీసమేతుడై శ్రీవత్స కౌస్తుభముతోడట్టు విష్ణుస్వరూ పమై కనుపట్టె గానట్టి ఆయమ్మ జూచి ఆశ్చర్యంబడి యింత్తటి వాడవు వుంట్టే ప్రతాపరుద్రుంణ్ణి కోడుకవచ్చునా అని మనస్సున యెంచి మారాజాడు ఢిల్లిసురథాణితోను మీ మహిమలు మీకె తెలుసును ప్రతాప రుద్రుంణ్ణి పంత్తిపెట్టుక ప్రసాదించి బహుమాన సన్మానములు శేశి హొర గింట్టికి అంప్పితె నీకీర్తి శాశ్వతముగా వుండ్డును అని తల్లిగారు చెప్పగా ఆ తీరుగానె మంజ్జన భోజనాదుల ప్రతాపరుద్రుంణ్ణి తృప్తి శేయించే బహుమాన సన్మానములు శేశి వోరగంటికి అంప్పిరి గనక ఆ వార్తలు విని వుండ్డురేగదా.

## అహమ్మదానగర, విజాపుర, గోలకొండ రాజ్యవృత్తాంతము

పెదదకోట బరుదు అనే ఆయన కొంత్త రాజ్యమున్ను కొంత్త దుర్గా లున్ను ఆక్రమించ్చుక బలవంతుండై రాజ్యం శేస్తావుండ్డును ఆయన వద్ద గిండ్డిపెట్టుకవుండ్డగా ఆతగానికి యెదులశాహా అనే పేరు వచ్చెను, కుక్కల కాపాడేటందులకు చేర్పుగాడై యుండ్డగా కుతుపవమలక అనే

పేట వచ్చెను, యీ ముగ్గిరిలో యెదులశాహా అనే అయన విజయాపురమున్ను నిజాంశాహా అనే అయన అహమదానగరమున్ను కుతుబుశమలక అనే అనే అయన గోలకొండ్డామున్ను యీ మూడు సంస్థానాలున్ను యేలుతావుండ్డురు- పెదదకోట బిదరు వారు వీరల పౌరతెనము లనంగా నూరేండ్లదనింన్ని వారిలో నిజాంశాహా పెద్దలు ఆ తర్వాత యెదులశాహా ఆ పిమ్మట కుతుబశమలక యీ క్రమాన సింహాసనాలను ఒడుగర బహామనీసం వక్కలాతులున్ను వడువున యీ మూడు యిండ్లనున్ను మంచ్చి గుర్రాలుగా లక్ష గుర్రాలున్ను నూరు యేనుగ ఘట్టాలన్ను గలవు. వాల్లాలంయేలే రాజ్యముగాదు కొలిచే తురకలు లేరు. కన్నాటకాన చతురంగ్గబలమింన్ని కలదు గనక యిక్కడి జగడాల సేవు ఆ దేశ ఎవారు యెరుగరు, అటుగనక కన్నాటకంవారి ముండ్దర కడమ పౌరతినాల వారు నిలువలేరు- అని కన్న కార్యములు తెలిపినిండ్డులరు అంచ్చు-శరావు జగదేవరావు పలకరింప్పినది పరే అని మలకరావు జెప్పినది- అని మొదలను తారశిల్లినప్పుడు తురకలు యెదురు బలమున్ను తనబలమున్ను జూచిక జగడం శేశేదిలేదు- ముష్కరముగా నడవగా యెదటివారు విరిగినట్టాయనా యెండ్డుబోయినా విడువక నరుకుదురు- యెదటివారు హెచ్చుత్తుగా విర్చినట్టాయనా వెనక బతిమాలుదురు- ఆ వర్తమానములు యెరిగి వాకిటి పిన్నపెద్దలు నియ్యోగులు జగడం శేశేది కార్యంగాదు, తీశిరమ్మంటే ఆ క్షణమె తీశివచ్చే దింత్తేగాని అని మొనలకు వచ్చి వెనక తీశివచ్చినట్లు అయితే ప్రభుత్వానకు కొదవగా అనే అభిమానం యెంచ్చి విలిచేది లేదు, అటుగనక కన్నాటకం వారు విచక్షణులై కార్యాకార్యములు తెలిశి జగడ మిచ్చి పోరాని కార్యమైతే యెదురెక్కి నడచి ఉత్తరింతురు కాబట్టి ప్రభుశక్తి గలదు గనక బంట్లు బయిదళాలున్ను అంద్దరున్ను పనికివత్తురు అని తెలుపగా వద్దమన్న అమరనాయకం వారలు అంద్దరున్ను ఆ తీరున్నె అవునని విన్నపం శేశినారు గవక రాయలవారు ముండ్దువెనకలు జగడాలు జంక్కెలు శేశి జయాపజయములలో వుండ్డిన

మీకు చెప్పాయగా తెలుసును గనక తురకల మీది కార్యం శేయ వలసివున్నది. అంద్దరున్ను తలలు కడుక్కొని పయనములై వుంద్దురా ప్రత్యేకంగ్గా ఉముగర వక్కలాకులు యిచ్చి పంపునవారై అప్పాజీ మొదలయిన ఆప్తులతో మాటలాడుతా వుండ్దంగా గజపతి వారల రాజ్యంబు శ్రీపురుషోత్తమాన నుండ్డింద్ది వేగులవాయువేగి హనుమంత్తంయ్యాను మనోవేగి పురుషామృగమయ్యాను వచ్చి నిలిచి రాయల దేవునితో విన్నపం శేశినారు గనక రాయలవారనిన వివరం- విద్యానగరమంద్ధునుండ్డి పయనగతుల తలిఙ్గ గజపతి రాజ్యంబ్బు శీమ భూములున్ను చూస్తా రాజమహేంద్రిం వారు కటకము మొదలయినవి వీక్షించ్చి ముకుంద్ద బాహుబలేంద్రులు జగన్నాధాన నుండ్దగా పురుషోత్తమానకు పోతిమి. శ్రీకృష్ణదేవుని పట్టం శృంగారమునకు పద్యం-

సీ. ఏవంకఁజూచిన హేమకుంభప్రభా
మండితోజ్జ్వల సభామంటపములు
నేవీధిఁజూచిన విచిత్రరంభా స్తంభ
దర్పణాంచితగృహద్వారభూమి
యేచాయఁజూచిన విభతురంగానేక
రాహుత్త సుభటవిరాజితంబు
నేదిక్కుచూచిన వేణసే(త్రా)కుచ
ఘనసారమృగమదగంధలహరి

యెచటఁగమఁగొన్న నవరత్నఖచిత రచిత
హాటకోన్నతవివిధశృంగారవనము
గలిగి చూపట్టు దేదీవ్యకలితమగుచు
శుభకరంబగు పట్టణశోభితంబు.

యిట్టి శృంగార శేఖరమయిన పట్టమంద్ధు జగన్నాయకులు మహోత్సవమునకు దిగ్దేశములనుండి వచ్చిన గృహస్తులు యతీశ్వరులు వానప్రస్థులు బ్రంహ్మచారులు బ్రాహ్మణోత్తములు పుణ్యాంగనలున్ను క్షత్రి

యులు వైశ్యులు శూద్రులు తక్కిన పదునెనిమిది జాతులవారున్ను వచ్చి స్వామిని దర్శించ్చి స్వామి యొక్క ప్రసాదం పిసు వారసిత స్వామి దేవళములో వృష్టిదోషం దృష్టిదోషం వర్ణాశ్రమ ధర్మా సీత శుచి అశుచి కలియుగ వైకుంఠమై వొప్పుతావుండ్డే ఆ యొక్క శ్రీతారకబ్రంహ్మమైన జగన్నాధుల మహిమాను అత్తలం వర్తమాని ములున్ను ప్రసాద ప్రభావములున్ను వర్ణించ వెయ్యి శిరస్సులున్ను రెండువేల జింహ్మలున్ను గల ఆదిశేషునకైన శక్యంప వలవిగావు అన్నట్టు తోచును. ముకుంద్ద గజపతివారు బ్రాహ్మముహూర్తాన నిదుర మేల్కాంచిన వారై నివ్రివర్యద్వయదర్శనం శేశి షోడశస్నాత్ర లున్ను తామున్ను నిత్యాహారిగా రెండ్డామడ మూడామడ దూరంపోయి తిరుగావచ్చి ముఖమజ్జన నామతీర్థమై గ్రిహారాధనశేశి జగన్నాధులకు పూజావిధాన ప్రికారాన షోడశోపచార పూజ.న్ను సహస్రనామార్చన నైవేద్యాలుశేశి దీపారాధన పుష్పాంజలి శేశి ప్రదక్షిణ నమస్కారములు శేశి పురము గృహం వెలువడి వచ్చేసమయాన పరదునేదార్లజ్ఞ స్థానాపతు లయిన అఘుపురం వారి అనంతోజీ పంత్తులున్ను మానసింగ్గువారి మాధవయ్యాను చాందువారి చెంన్నగిరయ్యాను కటకంవారి కరుణా కరయ్యాను వోరగంట్టివారి పోలయ్యాను ఢిల్లి సురతాణివారి ధాకోజీ పంత్తులున్ను బెదదకోట వారి బేకోజీ పంత్తులున్ను గోలకొండ్డ వారి గోపోజీపంత్తులున్ను అహముదానగరం పయ్యపరాజున్ను విజయాపురం వీరమరాజున్ను పుణ్యాపురం పురంద్దరయ్యాను బాగానగరం బాబోజీ పంత్తులున్ను మొదలుగాగల ముఖ్యులైన స్థానాపతులు అంద్దరున్ను ప్రాతఃకాలమంద్దు స్నానసంధ్యావందనాదులు ఆచరించ్చి తెల్లనిపట్టు ధోవతులు కట్టుకొని చలువలు ధయిరవానలుగా వేసుకొని. శుచిరుచి తోడట్టు దేవతార్చనా సమయానకు వచ్చినవారై దేవపూజా గృహం ముంద్దు లక్ష్మీవావడిలో కూర్చుండ్డగాను గజపతివారువచ్చి నవరత్న ఖచితమైన బంగ్గారు పీటమీద కూచుండిరి వారివారి పురాణికులున్ను పిలుపించ్చుక పురాణశ్రవణమైన తర్వాత ఆశ్రితులైన విద్వజ్జనులం

న్ను ఆశీర్వాదపూర్వకముగా యిచ్చిన విభూతిగంధాక్షత నారికేళ లకుచ ఫలాదులు గజపతివారు రెండ్డు చేతులా అందుకొని శిరసావహించి వారలకున్ను స్థానాపతులకున్ను జగన్నాయక ప్రసాద పణ్యారములు వక్క-లాకులున్ను యిప్పించ్చి వాలజాను విడిదీలకు పంప్పినవారై వేరొక్క- బ్రాహ్మని బిలిచి పాదప్రక్షాళనం శేశి గంధాక్షిత పుష్పములచేత లెప్పగా పాదపూజశేశి నూరు ఫెట్లున్ను వక్క-లాకులున్ను యిప్పించ్చి ఆపాదతీర్థమున్ను పుచ్చుకొని ఆపాదరేణువు శిరసావహించి తర్వాత తాము పాదప్రక్షాళనం చేసుకొని ఆచమనం శేశినవారై బంధుజనుల తోడట్టు బంగ్గారుపళ్ళెరములు వుంచ్చమని ప్రసాపాటుకు కూర్చుంన్ని తావున వణపదార్థమున్ను కొరవబడకుండ్డా సకలమున్ను పడ్డించ్చమని ఆపంక్తిని వొకతావున తెరగట్టి ఆ తెరలో నవరత్న స్థాపితమైన పీఠమున సుఖాసీనులై కూచుండ్డగా పదివన్నె బంగ్గారున నూరుశేరుల శేయించ్చిన పళ్ళెరమున్ను ఆ పళ్లెరం మధ్య వెల హెచ్చు గోమేధికముంచ్చి పళ్ళెరములో వడ్డించ్చి ప్రసాపడేపట్ల వకతేప కలుపుకొన్న కూర మరి వొకతేప కలుపుకోకుండ్డా భక్ష్యాలలో వొకసారి భక్షించినది రెండ్డోతేప భక్షించ్చకుండ్డా బానిశెలు హెచ్చరికలుగా చూస్తావుండ్గి పరాకున ముట్టినప్పటికిన్ని బెత్తపుకోలచేత హస్తముమీద స్పర్శించ్చి ముట్టవలదు గనక ఆరీతె తిరుగా అంట్టక ఆరోహణం శేశి యీ రీతున సకలవస్తువులున్ను భుజియించ్చి లేచిన పిమ్మట చేతులు గట్టుకొని శతపదాలు పదున్నుంన్ని సంక్షేప రామాయణం పారాయణం అయిన తర్వాత వస్త్రాభరణాలంకారులై పేరోలగంబై సకలమయిన వారున్ను నగరి వాకిట కూర్చుండ్డివుండ్డగా గజపతివారు వకఅంతస్త చావళ్ళోనికి వచ్చి కూర్చుండి రెండ్డు వినియోగముల వారున్ను పిలుపించ్చి వారు వారు వుండతగిన పుసుకులు కూర్చుండ్డనియమించ్చి ప్రస్తావోచితముగా షోడశ పాత్రులతోనున్ను పరస్థలపువియ్యోగులతోనున్ను సంభాషణ శేయగా విజాంశాహావారి పీలాబ్రిపంత్తులు వారున్ను యెదులశాహా కుత్తుబన మలక వారి స్థానాపతులున్ను తంప్పించ్చిన కాకితములున్ను కన్నౌజ

టకాధీశ్వరులు కార్యముఖానకు నడిచేవారై చతురంగబలమున్ను జత శేసుక బైలుపెరసి నరుదులకు వచ్చి కనుపించుచునేవారై వున్నారు. యీవరకు ఉత్తరందక్షిణం దొరలకార్యాలకు హాని వృద్ధులకు సహాయం సంపత్తి నడుపుదురు. ప్రబలమైన కార్యాలయితే అందరున్ను ఏకగ్రీవమై ఉత్తరం అహుపురం వారి కార్యాలకున్ను నిర్వహింతురుగా- యిప్పుడు అంతేసికార్యాలు యేమివున్నది, నరుదున వుండేవారు గనుక యితరం గాదు గదా, యెదులకావాలున్ను నిజాంకావాలున్ను కుతుబషాలక వారున్ను నరదుస్థలాలు క్షేమబుద్ధిగా యోచనకాయగా నడిలేదు అందుకు మించ్చిన కార్యాలయితే అహమ్మదు నగరం పర్యంతం వత్తురు, అవి ఘనంగ్గా వ్రాసి అంప్పెనారు- మనుష్యయత్నమున అపజయమని యెంచ్చరాదు- కన్నాటకం వారికి జయం నిశ్చయం అయినప్పటికిన్ని నరదుల మూడు తెగలవారున్ను విరిగినట్టయితే మీ సీమలన్నిన్ని కోలుబోయి మీకున్ను అవధి వచ్చును, కాబట్టి దీర్ఘయోచన విచారించ్చుకొని యాది హెచ్చరికలు గలిగి నడిపించ్చుకోవలెను, అని మంత్రాలోచనగా అన్నందులకు గజపతివారు అందింటికిన్ని మన పాలిటి జగన్నాయకులు వున్నారు అని మంద్దలించ్చినందులకు మూడు తెగలవారి నియ్యోగులున్ను మీకు జగన్నాయకులున్ను తమ దొరలకు కర్తలున్ను వున్నారుగా కన్నాటకంవారు యేరుదాటి రాకుండా తమ మూడుతెగల కల్లిబిలములున్ను కృష్ణదాటి రాకుండా పాళ్యం దిగి వుండేటట్టు అంపుతున్నారు... మీ తెగ నాముజాదులున్ను నరదు స్థలాలబలవంత్తులై యుండేటట్టు కట్టడ శేయండా అని తెలుపగా గజపతి వారున్ను అరీతి అమరిక శేశే మని కొండవీడు, ఉదయగిరి, బెల్లంకొండ్డ, నాగార్జునం కొండ్డ ఒద్దూరు మొదలైన స్థలాదులకు యాది హెచ్చరికలు కలిగి వుండ్డ దగ్గరనేటట్టుగా నాముజాదులు పంపినవారై షోడశపాత్రులతో మున్ను యాది హెచ్చరికలు గలిగి వుండ్డమని మంద్దలించ్చగా వారు వాల్లీ నరుదులకున్ను దుర్గాలకున్ను రస్తుసామగ్రిలు అంప్పినారు. యిదిగాక ముకుంద్దగజపతి వారు షోడశపాత్రులున్ను తామున్ను దివ

ప్రతిదిన్ని గోదావరీస్నానకు పోయి నదీస్నానం జేశి జగన్నాయకులకు పూజానమస్కారములు శేశి బైలు వెరశి పట్టానకు వచ్చేటందుకు రెండు ఝాములు వెల్లును గనక తాము దిగిన స్థానఘట్టానకు చుట్టున్ను పొడియత్రోవకు మనిషి సంచారము లేకుండ్దా శేశి శబ్దమున్ను వినరాకుండ్దా శేయూడా అని షోడశపాత్రులతో చెప్పి దిట్టపరచివుండ్దురు గనక కాపుకరలు అయా ప్రాంత్యాదులున్ను సద్దుశేయక వుండ్న్న తావులనె వుండ్దురు- గోదావరీనదికి వుత్తరపు భాగానకు యెనిమిది గుర్రాల వారున్ను గొండ్దారణ్యం సమీపం గనక ఆ దిక్కులనుండి మొగలాయి గుర్రాలువచ్చి వీరువారని యెరుగరు గనక వక కార్యంవస్తే మోసం వచ్చునని యెంచి అవిమొదలు నాలుగు గుర్రాల వారున్ను చుట్టు రెండు ఘడియల మేరకు మనిషి సంచారము లేక తిరుగాడుతా వుండేటంద్దులకు రెండు గుర్రాలవారున్ను గజపతివారి సమీపాన యేటికట్టున రెండు గుర్రాలవారున్ను యీ రీతున పదహారు గుర్రాలవారున్ను జాగ్రత్తగా కాచుకవుందురు, గనక గజపతివారి స్థానసంధ్యావంద్దనాది కృత్యములున్ను జగన్నాయకుల పూజాపునస్కారములున్ను అయిన తోడుతోనె వూరికి వత్తురు, యీరీతిని వుండగా వకనాడు గజపతివారు స్థానానకు వచ్చి షోడశపాత్రులను యెప్పటిక్రమం చుట్టుపట్ల జాగ్రత్తగా కాచి వుండుమని పలుకరించి తాము స్నానము శేసి తమకృత్యముతోవుండ్దిరి. యీ పదహారు గుర్రాలవారున్ను నాటిదినం యెప్పటివలెనె స్నానఘట్టానకు రెండు గుర్రాలవారున్ను గొండ్దారణ్యం బాయల నాలుగు గుర్రాలవారున్ను యీరీతున తిరుగుతావుండ్దగా అట్టిపట్ల కొండ్దలో వుండ్న్న దొరలు గజపతివారు గుర్రాలతోకట్టు గోదావరీస్నానానకు వచ్చినారని వేగంగ్గా యీనమయమంద్దలి తురకలు నాలుగువేలగుర్రాల వారున్ను చుట్టుకొండ్దామని యోచనచేశి నాలుగు దొరతనాలవారున్ను నాలుగమూల ళోకించ్చరా తప్పు మార్గములుగాను గుర్రాలున్ను యేనుగులున్ను రవుతులున్ను మావుతులున్ను వచ్చేరభసం విని షోడశపాత్రులలో ఆ దిక్కున తిరుగుతావుండ్దే నాలుగు గుర్రాలవారున్ను యెదు

పుగా పోయి సమర మిచ్చినారు గనక నాలుగు తెగలవారున్ను నాలుగు వేలగుర్రాలవారున్ను యీ నాలుగు గుర్రాల వారికిన్ని చుట్టుకొని వుండ్గా ఆ నలుగురున్ను తమ తమ గుర్రాలతోదట్టు నాలుగువేల గుర్రాలతోదట్టున్ను తారకిల్లి నాలుగుతోవలా తరుమగా రెండుతులా పరుగుళాపోగా వేటాయతునకలుగా గుర్రాలున్ను రవుతులున్ను వీరికి వచ్చారు యేనూరు లెక్కవడపారి యీరీతి నాలుగు వీధులను వేయి గుర్రాలున్ను అంన్ని రౌతులుంన్ను చావకట్టుగా బడగా యథాయథలుగా చెడి విరిగి పారిపోయి వళితట్టు నిలిచివుండ్గా నాలుగు గుర్రాలవారున్ను అలశి నిలిచిరి గనక యీలోగా వరాళము పోయిన యెనిమిది గుర్రాల వారున్ను తిరుగా వచ్చే వేళ తురకలు గుర్రాలనుగని వమరముయ్యగా నిలుపలేక వటాపంచ్చలై పారిపోయినవారున్ను రణమందు మడిశిపోయి నవారున్ను యీరీతున బహుగుర్రాలవారు మడిశి పారిపోయిరి. అవి ఆలశి నిలిచి నాలుగు గుర్రాలవారున్ను వరాళంపోయివచ్చిన యెనిమిది గుర్రాలవారున్ను అంతు పంద్రెండు గుర్రాలవారుంన్ను గూడి గజపతి వారివద్దికిరాగా తురకలు తిరుగా శేఖరించ్చుకొని వెంట్టాడిరి గనక చుట్టు వరాళముపోయిన రెండు గుర్రాలున్ను తూర్పు దిక్కునవుండ్డి వచ్చెను. అంత్తలో ఆ మొగలాయిగుర్రాలు ఆ మట్టున నిలువక వెంబడించ్చుక రాంగా గజపతివారు జూచి గుర్రాలు మించి వచ్చెను యింకను ఇక్కడ వుంట్టే మోసం వచ్చును. అని యెంచి గుర్రాలమీది దృష్టిచేత జగన్నా యకులను మరచి బహువేగాన గుర్రాంన్ని యెక్కుకొని షోడశపాత్రు లతోదట్టు యేరు దాటి కొంత్త తడవువచ్చి జగన్నాయకులను మరచి యెత్తకవచ్చిమిగదా అని తలంచుకొని తిరిగి జూచే యడల గుర్రాల వారు ఉత్తరవుగట్టుకువచ్చి వమరమందు అలశిన గుర్రాలు గనక నీళ్ళు జాపుతాపుండ్గా వారలజూచి దేవపూజ పెట్టెంతలో స్వామిని వెంచ్చేపు శేయమరచి వృత్తపెట్టె యెత్తకవచ్చినారము అని అచ్చట నిల్చబడి గజ పతివారు చాలా విచారపడగా షోడశపాత్రులలో వొకడు చూచి యంత మాత్రానకు దేవరవారు విచారపడ పనిలేదు. తాను పోయి యెత్తుకో

వచ్చే వని చెప్పి అంప్పించుకొని వచ్చి నదిలో దేవతాచర్జన శేశినదిక్కున చూడంగా అచ్చట జగంన్నాయకులు వేంచ్చేశివుండ్డగా జూచి యెప్పటి వలెనే దేవపూజపెట్టెలో వేంచ్చేవు చేసుకొని రాగా గుఱ్ఱాల రౌతుగని వెంట్టాడిరాంగా వార్లను తెగవేశి యేరుదాంటి గజపతి వారివద్దికి తెచ్చి యియ్యగా గజపతివారు చాలా సంతోషబడి నేడు నిదురలేచిన వ్యాళ యెటువంట్టిదో వృధాకలహ మాయను అదిన్ని జగడము శేశినవారు తమతో యెరుక శేయక సయ్యేకయ్యము మంచి బహాగుఱ్ఱాలున్ను రౌతులనున్ను నొప్పిస్తిమి అని సమర మిచ్చిన పంద్రెండు గుఱ్ఱాల వారికింన్ని జగన్నాయకులు వేంచ్చేవు శేసుక వచ్చినరవుతులకున్ను ఉడుగర వక్కలాకులు యిచ్చినారు గనక తక్కినముగ్గురుంన్ను తమకు జగడం యెత్తకపాయనని విచారమున వస్తావుండ్డంగా అందులో నొకి పాత్రుడు గజపతివారి ముంద్దర రాంగా వకవనప్రదేశమున వచ్చేటప్పుడు నొకమాని కొంమ్మ గుఱ్ఱం మీద వుండ్డేరవుతు అడ్డబడివుండ్డె గనక అమానికొమ్మను తనచేతి మర్త్యఖండాన తెగవేశె గనక గజపతివారు జూచి సంతోషబడి ఆపాత్రునికింన్ని వుడుగరలు యిచ్చెను. కడమ రెండుగుఱ్ఱాలవారుంన్ను తమకు యేమిన్ని లేకపాయనని రాంగా మార్గం మద్యే నాలుగు మనుష్యుల నిలువున నొకి చింత్తమాని కొంమ్మ అడ్డముగా వుండ్డగా తన గుఱ్ఱాంన్ని కాలాడించ్చి గుఱ్ఱమున్ను తామున్ను హరిణిపుటంగ్గా యెగశి చింతమానుకొమ్మ రెండుచేతులా పట్టుకొని నిండు సంత్తోకం గుఱ్ఱాని తొడల నిడుకొని గుఱ్ఱమున్ను తామున్ను అంత రిక్షమున వేలాడుతావుండ్డిగా ఆవర్త్తమానం గజపతివారు జూచి చాలా సంత్తోషబడి - సమయాన కత్తి కట్టలాలు యిరువై ముప్పై తెప్పించి వేశి గుఱ్ఱమున్ను రౌతున్ను దించ్చి వారికింన్ని ఉడుగరలు యిచ్చిరి. వకగుఱ్ఱం పాత్రునికి బహుమానం లేక వుండగా గోదావరి గెట్టున వకకాలువ రెండు మనిషి నిలువున అరువైన నాలుగు ఆడుగుల వెడల్పున అడ్డమై వుండ్డగా తన గుఱ్ఱాంన్ని చబుకువవేశి కాలువ దాటించ్చగా గజపతి వారు జూచి ఆ రౌతునకున్ను వుడుగరలు యిచ్చి అందరికిన్ని యేకముగా సంత్తోషబడశేశి మరి వేడుకగా పట్టానకు

పోయిరి గనక యివి యెల్లా మేమున్ను జూచినవారమై పట్టములోవికి వచ్చి గజపతి వారి పెగత్తెన్ను షోడశపాత్రల యింట్లున్ను వాళ్లా గరిడిన్ని అగరిడిలో సాధన శేశేవాళ్లనున్ను చూస్తిమి వారు శేశే సాధన మెరవళ్ళు దేవదానవులు వహా శేయలేరు. శీమాంత్రరం జగజెట్లు జేసే సాధనమెరవళ్ళు చూచివుందురు. ఆ తీరుగాదు. దారలేయెత్త వలెను, అటువంటి సంగ్గడాలు యెత్తేదిగాక అడ్డముగా యెత్తుతున్నారు, కొంమ్మిది వద్దెల గోశాం మాపిసి చెయ్యెత్తుపొడుగు వాడిని యెత్తేదిన్ని పైబడ తోసుకొనేదిన్ని గాక గోశాం తొడల విరుమ యెత్తుకొని అర్ధి దూలానను పేలాడుతావున్నారు, అది యేలాగంటేను జగడములో రౌతు రౌతున చంక్కనిడుకొని అమాంత్యముగా గొంచ్చుపోదురు. అదిగాక గుర్రాలు విడువక పోరాడితె శక్యముగాదని విడిపోదురు. తీరావఙ్లోకం గుర్రాలవారికి పోటువాటు తాకిన అందుకు వెరవరు. అటువంటి రపుతుమ చంక్క వేసుకపొయ్యే మని చూతురు. ఆ సమయానకు తెలివి గలిగి కడకతోడ బలిమిగలిగి వుండ్డేటందుకు యీ రీతున సాధనలు శేతురు. సుమ్మి మత్తెఖండం వఖమవిషి తలమోపుకదు అమర్త్యా ఖండంతీసుక మాసగజాల గోడలు యేమిన్ని లేకుండా నరకుతావున్నారు. చింతచేవకంబాలు ఆ ఖడ్గంచేత అరిటిబొండ్డె నరికినట్టు నరకుతావున్నారు. గొడ్డపారలు రెండొకటిగా వాటి తెగవో నరకుతా వున్నారు. వారలు లాలావు బిల్లలు గెంప్పవిండ్డా తెచ్చి పెట్టుక నాలుగు అయిదు తాళాను వఖటిగా మెలిపెట్టివేస్తే కరమల వాండ్లు వాటిని విడిపించ్చలేక సమ్మెటతో గట్టి విడిపించి చక్కగా క్కొట్టి మరుచునాటికి తెచ్చి యిస్తా వున్నారు.మరిన్ని యిఖ్ఖసగుదియలు గురిపెట్టి విరువనున్న దిక్కునన్నె విరుస్తావున్నారు. యీ శీమజెట్లు అరకు వచ్చిజూచి సాధన మెరవళ్ళు తమకు అసాధ్యమని వత్తురు. అచ్చట కలిమి బలములున్న యెక్కడా జూచిందిలేదు. అదిగాక గజపతివారి యెవ్వరికి త్యాగమిచ్చినా యేనుగ, గుర్రం, శాశి, చౌకట్లు, దట్టీ, కూళ్లాఇ, కబాయి, వక్కలాకులు యిచ్చేదింత్తేగాని యీ దేశంవలె పుడుగరల వక్కలాకులు మాత్రం యిచ్చి

అంపేది లేదు. అనింన్ని మరింన్ని కన్నవిన్న వార్తలు ఆలోచనలు మొదలుగా విన్నవంశాయగా రాయలవారితోను అప్పాజీగారు పలుకరించ్చిన వివరం గజపతివారనంగ్గా పుణ్య శ్లోకుండ్డు; తురకల వలె గాదు; దేవబ్రాహ్మణ విశ్వాసం కద్దు, అదెట్లంట్టేను— ముకుంద్ద బాహుబలేంద్ర గజపతివారలకు శత్రువులైనవారు జగన్నాయకులను పూజించ్చే అర్చకులకు వెయ్యారులు లంచ్చమిచ్చి వొద్దికశేసుక నిత్య

## గజపతివారికి విరోధులు విషప్రయోగము చేయించుట

కృత్యమున్ను జగన్నాయకులను శేవించ్చి తీర్థప్రసాదములున్ను పుచ్చుకొనిగాని ప్రసాదదేది లేదు. గనక వక నాటికి తీర్థములో వత్సనాభము కలిపి యిమ్మని నియమించ్చగా ఆ అర్చకుడు ఆద్రోహానకు లోనై ఆ తీసువచే తీర్థములో వత్సనాభము కలిపి స్వామి సన్నిధిని గజపతివారికి తీర్థం ప్రసాదించ్చే వ్యేళ నంబివానికి చేతులు వణకసాగెను. అప్పుడు గజపతివారు చూచి చెయ్యి వణక నిమిత్యమేమి అని అడుగగా భయస్థుడై చెప్ప వెరచి వుండ్డె గనక గజపతివారు జూచి యేలవెరచేరు కలిగిన అర్థం నిలువరముగా చెప్పమనంగా ఆరినృపాలులు శేయించ్చిన కార్యం వవిస్తరముగా చెప్పెను. గనక ఆ విషోదకము తెమ్మని చేత తీసుకొని అప్పుడు చెప్పిన శ్లోకం—

అరిర్మిత్రం విషం పత్యా మధర్మో ధర్మతాంవ్రజేత్
అనుకూలే జగన్నాథే విపరీతే విపర్యయమ్.

అనే శ్లోకం చదివి తీర్థం పుచ్చుకోగా ఆ విషం జీర్ణానకు వచ్చెను. ఆ వార్త లోకప్రసిద్ధమాయను. వారు అటువంటి దైవజ్ఞులని గజపతివారి గుణాతిశయములు యెంచ్చినవారై వేగులతు వుడుగర వక్కాలా కలున్ను వెయ్యేశిఖుట్లున్ను యిచ్చి యింకా ఆయాదేశములకు బోయి

నానాటి వార్తలు దెలిసివచ్చి చెప్పుమని వాయువేగి హనుమంతయ్యను మనోవేగి పురుషామృగయ్యను అంపించ్చి రాయలవారున్ను అప్పాజివారున్ను ఆలోచనగా దిక్కుల వార్తలు విన్నారేకా యింద్దర తురకలమీదికి కదలి పొయ్యే కార్యములకు ఆలోచన యెంచి అవి అదుగగా అప్పుడు అమరపు దొరలమున్ను అయిత్తపాటులో వున్నారు. దండ్డు యాత్రలకు లగ్నం పుంచ్చేటందుకు జోశ్యులను పిలుపించ్చి

## రాయలు తురకల మీఁదికి యుద్ధమునకు వెడలుట

ముహూర్తం పుంచమని ఆనతియ్యగా ఆ తీరుననె అప్పాజిగారు జోస్యుల రప్పించ్చి సుదినం సుముహూర్తం సులగ్నం కూడినవేళ వెలిగుడారము వేశేటట్టుగాన్ను పాళ్యం కదలిపొయ్యేటంద్దులకున్ను ప్రవేశానకున్ను లగ్నం నిశ్చయించ్చిక రాయలవారికి యెరుక శేయగా ఆ తీరుననె, వెలిగుడారం వేయించ్చుమని ఆనతిచ్చివారు. గనక ఆదేశికి అప్పాజి రాయలవారితోను తురకాణ్యంమీద దళమెత్తేటప్పుడు బోయదొరలంద్దరి నిన్ని రప్పించ్చి పదునెనిమిది కప్పణాలవారినిన్ని నగరవిందు పెట్టించ్చి హరిబాణం కొమాళ్ళతోను కార్యముఖానకు తురకాణ్యం శీమలోను మునకలుగా బోయి దిగి మూదేశి అమరదూరం పారినరాశఁపోయి మనుష్యుల, పసలం, ప్రాయలు, గొర్రెలు, మేకల, గుర్రాల పుంద్దకుండా కొళ్ళబెట్టి మనింప్ని యెదిరితోడట్టు సకల సన్నాహములతోడట్టు బయలు మెరశి వెలిగుడారమునకు వచ్చి నిలిచి దొరమన్నీలమున్ను, రవుతుల, మావతులమున్ను, నియోగం పైకంవాళ్ళున్ను, ముసపటివారు వెవకటివారు. యెడవంక్కంవారలమున్ను అంతరినిన్ని రప్పించుక వారివాళ్ళతో మాటపలుకులు ఆడి మిముస్తోమములతో అయత్తపాటుతో రమ్మని బలవంక్కం అమరనాయకం వాళ్ళతోనున్ను నగరికై శీతం వారితోమున్ను నగరి.శాంమ్మిది.సంప్రతుల వారితోమున్ను నగరి లెక్క ప్రకారానకు యేనుగ, గుర్రాలు,రౌతురాణున, గలట్టుపైదళం వారినిన్ని గణితి తీసుకొని. కన్నాటకానదం స్వతంత్రప్యామ్యం కావలికట్లు

గుంపుల వారినింన్ని పాళ్యగాల్లణమంన్ను నగరిలెక్కప్రకారానకు అంద్దరినిన్ని రప్పించ్చి పయనం తర్లదా అని కరణీకులతోనుంన్ను, రాయసం, కటికం, దినసరి, అవసరం, నినియోగపైకం వాల్లణతో నున్ను ఆనతిచ్చి కొంత్తగుఱ్ఱం రాణువనున్ను విజయనగర పట్టణమునకు రక్షణియ్యముగా సాళువ తిమ్మరసయ్యగారినింన్ని పట్ణమంద్ధువుంచ్చి దండ్డుయాత్రకు జయధ్వనిగా దిక్కులు పిక్కటిల్లేటందుకు భేరితాడనము శేశి దమామి లోకించమని ఉత్తరవు శేశి రౌతులకు మావుత్తులకు అమరనాయకంవార్లను, అల్లుండ్లు, కొమాళ్ళకు, రాజులకు, జట్లకు, కంమ్మనాయకులకు అందరినిన్ని పయనంజెప్పి రంమ్మని కటికాలవారికి వుత్తరవుయిచ్చి తామున్ను భోజనం జేసుకొని మూదో నగరా లోకించ్చమని ఆనతిచ్చి గుఱ్ఱం యెక్కుకొని పయనంగతుల కదలి వుమ్మత్తూరు శివసముద్రానకు వచ్చి గంగారావు వూదెముమీంద కార్యముశేశి వుదరదోలి అస్థలాలు నక్కనాటనె సాధించ్చి అక్కడ వూడిగాలవాల్లణను వుంచ్చి అందునుండి శ్రీరంగపట్ణం కోటకై చీని కోటకొత్తళములు జూచి మీద ఆదిరంగనాయకుల శేవించ్చి యిక్కెరి ఆ రంగ్గానకు వచ్చి సుక్కుల నాయడికి నాయడిమూకలను జూచి విజయాపురం నరుదుల నడవమనంగ్గా నరుదుస్థలాలవుండ్డీ గురిమనుష్యులమంన్ను దుర్గాలవుండ్డేరాణువనుంన్ను నిర్వహించ్చలేక విడిచి పారిపోసాగిరి. గనక అందుండ్డి రాచూరి, ముదికల్లు, అద్దంకి; అదవని ఇవి మొదలైన స్థలాదులకు ఠాణ్యాలు వుంచ్చి దినమొక్కటిగా పారినడవగా స్థలముల వుండేవారు మునుకలు గానె వచ్చేదళాన్ని జూచి పారిపోయిరి. గనక సాధించ్చిన స్థలములకు ఠాణ్యమువుంచ్చి గోలకొండ్డవారి నరదుస్థలాలకై నడవంగా అక్కడ మూడు తెగాల రౌతులుంన్ను యెదురించ్చి యేరుదాటి వచ్చి మోర్చావేశి పాళ్యముదిగినారు గనక ఆ వర్తమానం తెలిశిన వేగర్లు వచ్చి రాయల దేవునితోను తురకలు లక్ష గుఱ్ఱాలతోదట్టున్ను వెయ్యి యేనుగులతో దట్టున్ను కృష్ణదాటివచ్చి పాళ్యందిగినా రని వారి కలిమి బలములున్ను వారి వృథుతలున్ను వలుకరించ్చి వారి శీమలో మేవ తెగలవార్లు

లోకొచ్చి మూడామడకు మూడామడ వుండ్డే గ్రామాదులు కొళ్ళబెట్టి దింప్ని పాతరలు శోధించి ధాన్యధనములు యెత్తిదింప్ని గ్రహస్థుల ఇండ్లలో కొచ్చిపోయి ముండ్డుపెనక దాంచియుంచ్చిన పండ్డాప విశేషములు యెత్తిదింప్ని పూళ్ళుపల్లెలు కాల్చిదింప్ని పపలం, ప్రాయలు, మేకలు, గొఱ్ఱెలు, గుఱ్ఱాలున్ను పట్టుకవచ్చి కానుకు పకటిగా అమ్మేది యీరీతిగా విశ్వాపం శేశేదింప్ని దుర్గములలో వుండే వాళ్లెల్లా జితపమైవున్నార వివ్ని విన్నపం శేయంగా రాయలవారు విని తురకలు కృష్ణవేణిదాంటి వచ్చి డేరిజావేశి దిగేట్టా అని అగ్రహించుకొని అమరనాయకం వారలలో పెంమ్మపాని రామలింగ్గమనాయణ్ణి పిలిచి తురకలు కృష్ణవేణిదాంటి వచ్చి డేరిజావేశి పాళ్యం దిగినారట యిందులకు యేరీతున నరవవలెనో అని అడిగినందులకు– తురకలకార్యమనంగా యెంత మాత్రం – దేవరవారి ప్రతాపమువల్ల డెరిజాశాళ్ళు తెగకోశను. అప్పుడు ఛేరిశాడపంశేశి నడి ప్తేమ తురకలు మూడుతెగలవారున్ను పటాపంప్చలై విరిగి యధాయధలై తమతమస్థలాదులకు పొయ్యేటట్టు శేశెను. యిదిగాక యీ గ్రీష్మకాలాప దగదప్పులకు తాళి వాండ్లు నిలువలేరు. అని విన్నపం శాయగా తనకు శెలవుల్లకు యిమ్మనగా రాయలవారు బాలా పంత్తోషబడి రామలింగ్గమ నాయనికి పట్టీలు ఇచ్చి అంప్పగా రామలింగ్గమనాయడు పెలుపడిని వచ్చి తన తెగకమ్మ దొరతనాలవారి పండ్డరిని రప్పించుక వారలకున్ను చెయ్యెత్తిమ్రొక్కి యిన్నాళ్ళున్ను రాయలవారి పంబ్బళము లు ప్రపాదిడి బ్రతికితిమి. యేలినవారికి యిప్పుడు కార్యనరవికలిగి అని మొనకువచ్చి యెదటివారిమీదికి నడువమని బహూమానం పక్కలాకులు ఇచ్చి పంప్పగా వస్తిమి. యీ బహూమానం మీదిగనక మిమ్ము నమండి మానుషము యింన్ను ముండ్దరికి కంమ్మకులం వారికి బ్రతుకలున్ను ప్రతిష్టలున్ను కీర్తిమాటవానులు కలుగశేశేటంద్దులకున్ను ప్వర్గాదిభోగములు అనుభ వింపేటందులకున్ను తనతోకూడ నడచేవారెల్లా నడువండ్డా తక్కినవారె ల్లా బారులో నిలువుడా అని తొక్కి నడువగా అయన పంతరించ్చిన యెన భై వేల చివ్వలవారున్ను రణపెండ్లికొడుకులై యిక్కడి అశపాశలు

విడిచి కయ్యా మంద్దేదే వియ్యామంద్దేదిగా యెంచ్చి అని మీది దృష్టిచేత రామలింగమనాయని వెంబ్బడిని నడువంగా తురకలు యీవార్తలువిని దెరిజావద్ద జీరావంజ్జోగంతో విద్బుకత్తుల రౌతులు అరవై వేలున్ను వారిని చుట్టుక విందువంజ్జోకం గుఱ్రాలు పదివేలకున్ను వాళ్లనాను అనుభవించ్చుక యుండ్డె మదహత్తులు వెయ్యింటికిన్ని యీరీతిని దెరిజావద్దవుంచ్చి మూడు తెగల తురకలున్ను తమ తమ పాళ్యములో ఆయత్తపాటుకో జాగ్రతగలిగి యుండగా రామలింగమ నాయుడు తురకల పాళ్యంవారి సమీపానకు పోగానే గుఱ్రాన్ని కత్తికేడం తీసుకొని యేనుగల బారుమీద శైలతటమునకు లంఘించ్చు సింహ్వాపుపిల్లల చందాన తొక్కినడిచి మదహత్తీల తొండముల ఖండములుగా నరికి మావటీలను యీటెలచేత కుమ్మి తోయగా యేనుగలవారి మీందికి నడవగలవారు గుఱ్రాల పక్కెరలెత్తికురుచ యీటెలతోనున్ను పిడి యీటలతోనున్ను వంద్దిబల్లెములతో నున్ను గుచ్చి తోశేదిన్ని దోవకాయల చంద్దాన వేటారుతునకలుగా నరికేదిన్ని యీరీతు నొప్పించగా గుఱ్రాలవారు వెనకముంద్దై పారపాగెను. అప్పుడు నాలుగువేల గుఱ్రం చాపకట్టుగా బడగా అటువెనక విద్బుకత్తుల రవుతులమీద నడిచి జగడమియ్యగా నరిచావులుగా ఆరు వేలకు నాలుగువేల రవుతులు పడిరి. అంతట రామలింగమనాయుడు జీరాతాళ్ళు తెగకోశించ్చగా దెరిజా నేల కూలిన క్షణాన్నె కృష్ణరాయల వారు భేరితాడనం శేయించి మదహత్తి నెక్కుకొని ఉభయచ్ఛత్రములతోనున్ను మకలచెక్కెములతో నూటయిరువై ఘట్టములు యేనుగలున్ను అరవైవేల గుఱ్రాలున్ను అఇదులక్షల పాయదళమున్ను పొట్లముగా నడిచిరి, గనక ఆ క్షణాంన్నె కృష్ణవేణి వుభయతీరాలున్ను ప్రవాహం నిండి రాపాగెను, జగడముఖానకు తురకల యేనుగల మొన చేప్తే గ్రీష్మకాలం యెండ్డచేతను దస్సిన యేనుగలు గనక దగదప్పి పుట్టి చల్లగాలిచేత కాలుజారి కృష్ణవేణిలో బోయిపడెను. గుఱ్రాల రౌతులు యేరు యీతు వచ్చెను యివతలమండ్డి కార్యం కాదని గుఱ్రాల వారు యేనుగుల వెంబ్బడినె తిరిగి మొదటి దొరలు ముగ్గురున్ను

పైపీకంగా పెడతలపోటుగా ప్రవాహంవచ్చె గనక యిక్కడను పాళ్యం ఓగి జగడమిచ్చేమంట్టే రస్తుసామ్యగ్రిలున్ను అమరదు. అని దొరలు ముగ్గురున్ను నియోగ్యులతో ఆలోచనగా వారి అన్నిటికిన్ని యేరు దాంటి ఆవలనిల్చి నరిపోయినట్టు నడిపించుకొందాము శీమకు తిరుగగానె యేరు నిండ్డారుగా వచ్చెను రాయలవారున్ను వెంబ్డికించ్చి పడిచి జగడం శేయగా అందరున్ను విరిగి పారిపోయిరి. కొందరు యేట్లో బడిరి గనక నగం రెండ్డుపాళ్ళు యేటివరద పోయిరి. మఱిపాలు దక్షిణపు గట్టున నిలిచెను. ఏనుగ లన్నిన్ని ఈళ్ళు విడిచి గట్టుకు రాకపోయెను. గనక మావటీలు యిఖను నిలువకూడదని దిగి ప్రాణాలతోదట్టు తప్పి పారిపోయిరి, మూడుతెగల తురకలున్ను అంతట యేనుగుల మీదనుంచిన్ని వోడలమీదికి దిగి ఉత్తరపుగెట్టు యెక్కి ఆలోచనపరులై యీనమయాన నిలిచేది కార్యం కాదని తమతమ స్థలాదులకు హత శేషులైనవారి గూర్చుక గట్టెక్కిన గుర్రాలతోదట్టు విజయాపురం, గోలకొండ్డ, అహమదానగరం చేరబోయినారు. గనక కృష్ణరాయలవారు కృష్ణవేణి వొడ్డుకువచ్చి మూడు తెగల తురకల యేనుగ గుర్రాలున్ను నగర కట్టి పెట్టమనిన్ని గుడారాలు నిశానులు నగారా మొదలైనది మొదట జగడాన దొరికింద్ది గనక అదంత్తా నగరకట్టమని అప్పాజీ మొదలయిన నియోగ్యులతోమున్ను ముక్కుతిమ్మన్న మొదలయిన కవీశ్వరుల దిక్కుజూచి సేటిజయం యేరీతి అని అడిగినందులకు ముక్కు తిమ్మన్న చెప్పిన పద్యం-

క. నరసింహకృష్ణరాయా
దురమున నీపేరు పేరఁ దురకలఁ ద్రుంచేఁ
గరిరాజవరదుఁ డవనీ
కరిఘటములు నిన్నుఁజూచి గ్రక్కునఁ దిరిగెన్.

అని ముక్కు తిమ్మయ్య్య అలసాని పెద్దన్న మాదనగారి మల్లయ్య్య మొదలైనవారు విన్నవం శేశినంద్దులకు అప్పాజీ, అయ్యమరసు, కొండ

మరను, దాచరనుగారున్ను అనేక స్తుత్యములుగా విన్నపంజేశి కృష్ణవేణి యీవమయీవ వింద్దేరు వచ్చినంద్దువల్ల మ్లేఛులకు అపజయమై విలువ లేక తమతమస్థలాలకు పోయినట్లాయను. యేరు నీళ్ళు వడిసి కాలినడ అయినతోడుతోనే ముంద్దరకార్యము ఖానకు వడవవలెను. యీ ఆషాఢ శ్రావణాలు రెండు నెలలున్ను యేటికి దక్షిణముగానున్న తురకల దుర్గాలున్ను కోటస్థలాలున్ను గజపతిదుర్గాములున్ను స్థలములున్ను చేకూచుకొక ఆ తర్వాత అహముదానగరం పర్యంతమున్ను పోయి రావలెను. అవి విన్నపం శేశినంద్దులకు కృష్ణరాయలవారు మీరు చెప్పి నది కార్యనరవి అవును. మునకలుగా యేరుదాపిటి మ్లేచ్ఛులరాజ్యా నకు కదలిపొయ్యి వట్టాయనా గజపతివారి శీమలోనున్న ఉదయగిరి, కంద్దూరు, కొండ్డవీడు, బెల్లంకొండ్డ, నాగార్జునం కొండ్డ, వినుకొండ మొదలైన దుర్గాలలో వున్నవారు మనదంద్దుకు రస్తుసామగ్రిలు రానీకుండ్డా అరికట్టుదురు. ఆ రీతిగాకుండా మునకలుగా ఆయాస్థలాలు సాధించి ఆయా దుర్గాలను మనతెగ తాంణ్యములు వుంస్తే రస్తుసామ గ్రీలు నడుచును. అవి ఆనతిచ్చినారు గనక వద్దనున్న పిన్నపెద్దలు కార్యముగా యెంచి ముంద్దరతేరలే యత్నం గనవలెనన్నారు. కాబట్టి రాయలవారు రవుతు రాణువ దొరమన్నీలకు అంద్దరికిన్ని పయనం చెప్పించ్చి భేరీ ధమామి కాహళాలవారిని రప్పించ్చి నగారా కూచి శేయించ్చ మని వారలా భేరిపూజ పేయించ్చి ట్రోకించ్చిన జయధ్వనికి పద్యం—

క. ధాత్రీశుఁ డంత దిగ్జయ
యాత్రానంరంభజృంభియటోపగతిఁ
శత్రువుల గుండె లవియఁగ
జైత్రప్రస్థానభేరి పేయించుటయూఁ.

ఉ. భూకంపంబు జనింప రొప్పఁగ మహాంభోరాసు లుప్పొంగఁగా
లో 'లోకములెల్లఁ బెల్లగిల ఘుల్లోకంబు ఘూర్ణిల్లన

శ్రీకవ్యాప్తినఖాండగోళదళనోద్భూతధ్వనిం బోలె న
ర్షాకాలాంబుదగర్జితధ్వనినమారంభంబులై మీఱఁగన్.

వారలున్ను నయనమని తెలిసి అయత్తపాటున కాచివుండగా రాయల వారు బయలువెడలి గుఱ్ఱంయెక్కి సకలసన్నాహములతో రట్టు సకల

## రాయలవారు ఉదయగిరి మొదలయిన దుర్గముల మీఁదికి దండెత్తుట

దళసమేతులై గుత్తి కండ్లికోటమార్గముగా ఉదయగిరికివచ్చిన హూర్మత్తు అనే దుర్గముపై లగ్గయెక్కఁగా దుర్గములోనివారు తమచేతనై వట్టు సమరంచేసి మందుగుండ్లు తలపై నిర్వహించ్చ లేక కాలిచ్చినారు గనక కాలువ దించి శత్రుజనాలు వెళ్ళిపోయిన తర్వాత రాయలవారు దుర్గంపై నెక్కి జూచి యింత రమ్యముండగా యేమని కాలిచ్చి వెళ్ళి పోయిరి. అని ఆశ్చర్యపడి కంప్పన్నను దుర్గమందు ఠాణ్యాం వుంచ్చి కందూర్కిపోగా దమామిధ్వని విన్నతక్షణానే ఆస్థలంవారు వెళ్ళిపోయిరి. గనక ఆస్థలం తొక్కిచూచి అచ్చట ఠాణ్యాం వుంచ్చి కొండవీటికి కదలిపోగా దుర్గములలో నున్న పూడెములవారు సముద్రం పొంగి వచ్చేరీతిని సేనాసముద్రం కదలివచ్చేదిగని కాలుధూళి మిన్నుముట్టి సూర్యరశ్మి గప్పినన గని స్థలములు విడిచి పొయ్యేవారున్ను కాహళధ్వని విని పారేవారున్ను యీరీతున కొండవీడుసీమ కోటలు దుర్గాలలోనున్నవారలు పరాఙ్ముఖులై తమతమ దొరలున్న ఠావుకు పోసాగిరి. తోయదొరలు పదునెనిమిది కప్పణాలవారున్ను మూడులక్షం పాయదళమున్ను కొండవీడు, కొండపల్లె, బెల్లంకొండ, వినుకొండ, నాగార్జునఁకొండ మొదలయిన దుర్గాలకు యేలుబడియైన సీమ లాద్యంతం నిపాతం చేస్తావున్నారుగనక ఆయాసీమలోగల ప్రజలందరున్ను సకలమును కొళ్ళయిచ్చి మిక్కిలి అందుపడి అయిన దుర్గాలు జేరివారు- అని వేగల్లూ అక్కడగ్గర పదుచు యోగక్షేమములు క్షణే క్షణే వచ్చి

విన్నపం శాయంగా విన్నవారై తిరుగా వాల్లనను ఆయా తావులకు అంప్పించ్చి కొండ్డవీంటికి పోయి జగడమియ్యగా కొనమూకలవారు విరిగిన మాత్రాన్నె కొండ్డవీడు కోటలోనివారు తీశిపోయినారు గనక ఆ దుగ్గాంమీద సమరం శేయంగా దుగ్గాంలో వున్నవారు తమవాత అయినమట్టు వకటిన్నర దినం పోరాడి రాత్రి దుర్గం విడిచిపోగా మరుచు వారు దుగ్గమెక్కి జూచి ఆ దుగ్గమంద్దు కొండ్డియ్యను తాణ్యాం వుంచ్చి వినికొండ్డకై నడవంగా వారు యీ వార్తలు విని స్థలం నిర్వాహింపనేరమని యెంచ్చి మునకలుగా వెళ్ళిపోయిరి. అక్కడ భాస్కరయ్యనువుంచ్చి బెల్లంకొండ్డకై నడవగావారు పిరంగ్గినాదం విని బెల్లంకొండ్డవారు పారిపోయిరి. యిచ్చట వీరభద్రయ్యను తాణ్యాముంచ్చి నాగార్జునంకొండకై నడవగా వారు నానాప్రయత్నముల నాటమన్నాళ్ళట పోరాడి చేతగాక తమనాటికి పోయిరి. గనక అచ్చట అయ్యలయ్యగారిని వుంచ్చి అహమ్మదానగరానకు నడవగా కొనమూకలవారు వెలిపాళ్యాలు చొరబడి చెర కొరాబట్టి చాలా కంపోలం శేయంగా కోటలోని గుర్రాలు వారు వెళ్ళివచ్చి యెదుటనిలిచి జగడమియ్యగా మూడుంముక్కాలు ఘడియలలోగా రెండువేలుంన్నె నమంమ్మారు గుర్రాలున్ను అంన్నియు రౌతులున్ను చాపకట్టుగా మృతంబొంద్దిరి గనక యీ సమాచారం కోటలోవున్న మొదటి దొరలయినవారు విని ఇఖను మనం కోటలో నిలిచి వున్నట్టయితే చేపట్టుగా పట్టుకబోదురు. అంద్దునుంచ్చి చాలా అవమర్యాద అని యెంచ్చి యేమి బోయినా బోని అని కోట విడిచి పారిపోయిరి. గనక రాయలవారు ఆ కోట యిడియకొట్టించ్చి ఆ పట్టం యెంత్తమేరో అంతమేరాన్ను వెలిపాళ్యాలుంన్ను దున్నించ్చి ఆమిదాల జిల్లెళ్ళు విత్తించ్చి అంద్దుండ్డి గజపతి రాజ్యానకై నడవగా అప్పాజి రాయలవారితో మూడుతెగల తురకల రాజ్యమంత్రాక పోలం శేశి వారి దుగ్గాలున్ను స్థలాలున్ను కట్టుకొని అహమ్మదానగరం ఆమిద్యాలు విత్తించ్చి గజపతివారి గిరిదుగ్గం జలదుగ్గం స్థలదుగ్గం వనదుగ్గం యివి అన్నియు ఆక్రమించ్చినట్టాయను, ముంద్దర... కదలి

హొయ్యేది కార్యం కాదు. కనుమలు దాటిపోవలెను. కనుమలలోవున్న గజపతివారి తెగవారు సామగ్రిలు తానియ్యరు. అని మంత్రాలోచనగా విన్నపం శేశినందులకు ఆ విశదూ రాయలవారు చిత్తానవుంచ్చుక ముందర కదిలిపోవలెననే దృష్టిని తమకు యెదురు లేదని యెంచ్చి అప్పాజీగారు విన్నపం శేశినందులకు అవుగాములా ఉత్తరవియ్యాక కదలిపోగా గజపతివారి కనుమలవద్ద హొయ్యేటప్పుడు చితాపుఖానుదనేవాడు అరవై వేల శింగ్గాణీ రౌతులతోదట్టు కనుమ మార్గామున హొయ్యే రౌతు రాణువమీద చిత్తవాన గురిశినరీతి అమ్ములు గుర్తియించ్చగా అంమ్ముల ముంద్ది తప్పించుకొను వారున్ను ఆయంమ్ములకు యెదురై నిలిచినవారున్ను ముంద్దు వెనక తెలియక నిలిచినవారున్ను ఆదాశ దిగ్భ్రిమ పడివున్న వారున్ను యీరీతిని వుండ్డగా చితాపుఖానునికి యెదురులేదు గనుక జగడం శేయగా ఆ సమయాన కన్నాటకం కైజీతం రౌతులు చితాపుఖానునికి పెడతలపోటుగా యిరుపార్శ్వాల కనమల హొదువున నెక్కి చితాపుఖాను వెనకదిక్కులకై వచ్చి శింగ్గాణులచేతనున్ను ఖడ్గములచేతనున్ను బరిశీలచేతనున్ను వేటారు తునకలుగా నరకగా చితాపుఖాను తెగలకు కనుమలో నిలువకూడక విరిగి పారగా వెంబ్బడించ్చి తరుముకపోయి వారిని దుర్గంచారదోలి తిరుగావచ్చిరి. గనక అప్పుడు చితాపుఖాను తెగలో యిరువై మూడువేల క్షోమమున్ను వాల్గువేలగుర్రమున్ను వణ తావున్నె మడిసె ఆటుతర్వాత సమదళం ఆద్యంతమున్ను ముంద్దరకదలిపోయిరి. గనక ఆ కనుమల్లో ముప్పైవేల క్షోమాన్ని తాణ్యం వుంచ్చి ఆవతల గజపతివారి సిమాద్యంత్తం నిపాతం శేసుకపోయి పోట్నూరి సింహాద్రివద్ద పాళ్యం దిగిరి. గనక యీ వృత్తాంతం గజపతివారు విని యేదులపాహా, కుతువవమలక, నిజాంశాహా వారు ముగ్గురున్ను నిలువలేక తిరిగి స్థలాలువచ్చిరి. గనక ముగ్గురు దునెదాల్లకమున్ను వీగతోలిన బలవంతులతో తాము ఏకదేశాన పోరాడేది యేరీతు అని ఆప్తులతో ఆలోచనశేయగా వారు గజపతివారితోను మన సింహాసనానకు షోడశపాత్రుల యొక్క భుజబలపరాక్రమాన యీ క్షోణిచక్రం

యేలుబడికి వచ్చును. యీవరకు కర్నాటకంవారు మనశీమలోనికి వచ్చినవారుగాదు. పెద్దగజపతివారువుండేటప్పుడు వారు సేతుయాత్ర కొరకై కంచ్చి, కాళహస్తి, అరుణాచలం, చిదంబ్బరం, జంబ్బుకేశ్వరం, కుంభకోణం మార్గముగా శేతువుకు పొయ్యేటప్పుడు వెంట్టవచ్చిన రౌతులు రాణువవారు రాయలవారి శీమలో గల శివస్థలాదులున్ను విష్ణుస్థలాదులున్ను తటాకాలున్ను అగ్రహారాలున్ను పల్లెలున్ను వనములున్ను పాడిశేశి వచ్చి వుందురు, అదిగాక వారిశీమలోకొన్ని స్థలాదులున్ను అక్రమించి మన్నిసమర్యాదలు తప్పించ్చి వుంద్దురు గనక అవి మనమ్మన మంచ్చి కృష్ణరాయలవారు కారణీక జన్ములైనవారు కాబట్టి మాడువిప్పే కొరకు మ్లేఛులయిన తురకలను వీగతోలి మనశీమలోనికి వచ్చి గిరిదుర్గ స్థలదుర్గ జలదుర్గ వనదుర్గములను యేండ్ల పరువళ్ళు పోరాడిన సాధ్యంకాదు- అట్టి దుర్గాలను కోటకొత్తళాలు దినమొక్కటిగా పారిమార్గముచేత అక్రమించ్చి తక్కిన కోటలు ధూళి కోటలుగా సాధించ్చినవారైరి గనక మనిషిమాత్రంవారుగారు. విష్ణు అంశ, అప్పండులకు గజపతివారు ఆరీతి అవును, తమపెద్దలు కర్నాటకావకు అపరాధం తలంచ్చి వందువల్ల వారు బలవంతులై మనరాజ్యం మీద దండెత్తి వచ్చినారు. వారిని జయించేటందులకు జయాపజయం కనవలెనని షోడశపాత్రులను పిలువనంప్పగా- బలభద్రపాత్రుడు, దుర్గాపాత్రుడు, భీమాపాత్రుడు, ముకుందపాత్రుడు, భీకరపాత్రుడు, భైరవపాత్రుడు, రణరంగపాత్రుడు, అఖండపాత్రుడు, మురారిపాత్రుడు, వజ్రముష్టిపాత్రుడు, తురగరేశంపాత్రుడు, అశనీపాత్రుడు, అవహాయపాత్రుడు, గజాంకుశపాత్రుడు, మృగేంద్రపాత్రుడు మొదలయినవారు పదారుపాత్రులు వచ్చి గజపతివారి పొడగనగా వారలను కూచ్చుండ నియమించ్చి వారలతో ఇదివరకున్ను నడచిన కార్యాలన్నింన్ని వింన్నారేకా- కర్నాటకంవారు కనముల దాంటి అహముదానగరానకు వచ్చి నిపాతం శేశి పొట్నూరి సింహాద్రివద్ద శిబిరం దిగివారు, యిక్కడికి నాలుగు క్రోశములమేర వచ్చివున్నారు; రేపుమర్నాట

దాటీఘాగ్గణంగా గుఱ్ఱం రాణువ వచ్చును. అప్పుడైనా కనుపించుకోవలెగాని మొదటిస్థళం విడువరాదు, ఆలోచనగా అడిగినందులకు షోడశపాత్రులు యీ ఆలోచన మునుపు మూడు తెగల దునేదార్లున్ను కర్నాటకం వారికి విముఖానరించ్చి నిలువలేక తమతమ స్థలాదులకు పోయినందువల్ల యెవ్వరినిన్ని యెంచ్చక తురకారణ్యం సీమలు దాంటి మన గడికనములున్ను తొచ్చి పట్నం సమీపానకు వచ్చినారు– యీ సమయాన మనం ఆ మూడు తెగలవారికిన్ని చెప్పి అంప్పించి వారు సరుదులున్ను బలవంతముగా వుండ్డ మని మనమున్ను యిక్కడనను కనుపించ్చుకొంటే యెంద్దుబోమంన్నారు– కాళహస్తి ఆరభ్యం జగంన్నాధంపర్యంతం మనసీమ– అట్టివట్ల యెదురు యెంచ్చక లోతు యెరుగరు గనక లోజొచ్చి వచ్చినారు, మంత్రాలోచనమీద వచ్చిన కార్యం కాదు, హామిక మీదికార్యం గనక వారికే ముప్పు, మన కార్యం జయమౌను; వారు యాయులు మనం స్థాయులు. మన సీమ ప్రజలకు వారలవీంగతోలి స్థలాలున్ను నిలుపవలెనని ఉత్సాహపుష్టి గనక ఇట్టివట్ల మనం కనుపించుకొంట్టేను కన్నాటకంవారు నిలువలేక తమ సీమకు పొయ్యే మని బోదురు. రేపు ఉదయాంన్నె స్వామివారు రౌతురాణువకు వక్కలాకులిప్పించ్చి అంద్దగినిన్ని అయత్తపడి రమ్మనడా– మీరు వజ్రప్రదేశాన రాజచిహ్నాలు. పట్టించ్చుక ఉన్నతస్థలానవుండ్డి వేడుకచూస్తేవాలును. తాము వదారురముంన్ను జగడమిచ్చిన కర్నాటకం వారిని పొరదోలి వారి బొక్కసభంణారములున్ను యేనుగ గుఱ్ఱాలున్ను మొదటిరొరలమున్ను హస్తగతం చేసుకవచ్చి సముఖానవుంచ్చే మని వారువారలు తమతమకు తోచినట్లు సాహసపరాక్రమములున్ను యుద్ధరంగ్గమంద్ది వేటారు తునకలుగా నరికేమనిన్ని మదహస్తుల తొంద్దములతో కూడా కొమ్ములు ఖండించ్చే మనిన్ని చెరుకుల నరికినట్లు కాల్బలములున్ను వాల్లచేఖంద్దములమంన్ను ఖండ్డించేమనిన్ని వింగ్గి సీమవట్టితే అంద్దరినిన్ని చెరలు తోలుకవచ్చేమనిన్ని శపథపూర్వకముగా చెప్పినారు, గనక గజపతివారు చాలా సంతోషపడి మీరువొక్కక్కరే వొక్కక్క

శాసను భీభత్సు శాయగలరు; మీరు పదార్థరున్ను పది దిక్కుల కనిపించ్చేక కార్యం శేస్తే ఘాలివానాను పురుములున్ను పిడుగులున్ను బడినట్లు భీభత్సుగా పోరుదురు యిదిగాక పూర్వమందు అర్జునుండు ఉత్తర గోగ్రహణమందు దుర్యోధనాదులమీద నడచి యుద్ధం శేశి ఆవుల త్రిప్పుక వచ్చేటప్పుడు అందరి పోగులున్ను శిరోవేష్టనలున్ను వూడశి వచ్చినట్టుగా గలరు- మీరు రణభీకరానకు కర్నాటకంవారు రణభీతిని పణకెత్తి యెవ్వరికిన్ని శరీరాలు తెలియక విస్మృతి బొంద్ది కాళ్లుచేతులాడక యెక్కడివారక్కడనె నిలిచివుందురు- మీరు అంత్త కార్యం శేయవలెను—తాము పయిడు బియ్యమువారు, మిగిలిన భోక్కనభండారానవుండ్డె రొక్కరోజనాలు శీమభూములు మొదలుగా గల భాగ్యం మీదిన్ని, రవుతులు రాణువ వారిదిన్ని అటుగనక కీర్తి అపకీర్తులు విచారించుక అవిమెనను యేరీతున నడిపించుకోవలనో ఆరీతి శేయండా - అవి షోడశపాత్రులకు ఉచితవస్త్రాంగ్గంబ్బులున్ను శిరోవేష్టి తాశి చౌకట్లు కడాయి దట్టి కస్తూరి వక్కలాకులు యిచ్చి ప్రియపూర్వకముగా యీవరకు తమవల్ల వేన్నునేరములున్ను ఆగ్రహనిగ్రహములున్ను వాగ్దోషములున్ను యేమి కలిగినా అవియెల్ల మననువ వుంచ్చక యీరీతున జయానికి ఉపాయం కనవలెనో ఆరీతువ కర్నాటకం వారిని విముఖుల శేశి గజపతి అనే పేరున్ను రాజ్యమున్ను నిలుపవలెను- అని అన్నందులకు షోడశపాత్రులు—అన్నింటికిన్ని జగన్నాయకులు వున్నారు, రేపు ఉదయాంన్నే మేమున్ను ఆయత్తబడి వస్తున్నారము మీరున్ను ఆయత్తబడి రావలెను— అని అన్నంతులకు అంద్దరున్ను యేకవాక్యముగా పలుకరించ్చిరి గనక ఆ వివరం ఆద్యంత్తం కన్నాటకంవారి స్థానాపతి కమలనాథయ్య కృష్ణరాయలవారి సమక్షమానకు పత్రక్రమముగా కాకితము వ్రాయించి ముద్రబడిశేశి అతి గోప్యముగా రాయలవారు అంత్తఃపురాన వుంన్నప్పటికిన్ని ఆయన చేతనే కాకితములు యిమ్మని చెప్పి అంపగా పొద్దుచేర నాలుగు ఘడియలప్పుడు వేగర్లు వచ్చి కాకితములు యిచ్చినారుగా—రాయలవారు తామె కాకితములువవిని జూచుకొని

కార్యం వినతప్పి తప్పిదాయను అని చాలా చింత నొందినవారై అప్పుడు అప్పాజీమాటలు వినకవచ్చినందులకు ఇంత కార్యం వచ్చెను- అని తమతో తామే చింత చేసుక అందరికిన్ని ప్రాణహానులు వచ్చెను, షోడశ పాత్రులు చెప్పేదొకటిన్ని చేసేదొకటిన్ని కాదు, యెంత వెళ్ళినాదినా అంత నడిపించ్చగలవారు- వారలపరాక్రమానకు యెవరుంనిలువలేరు, అని నిలిచిన దిక్కున నిలువక వున్నదిక్కున వుండక అరిజాలపడి అంధరికిన్ని యింత కార్యం వచ్చునని తలిజలు చింత పడుతావుండ్డింగ్గ పాళ్యములో ఆడాడ గలిబిలి అయ్యేదిన్ని మూకలు గుమిగూడి గువగువలుగా మాట లాడెదిన్ని అందువల్ల కొందరికి భయోత్పాతముగా తోచేదిన్ని యీరీతిని వుండ్డగా రాయలవారు దీవటీకొలుపై నిచ్చేశినట్టుగా నడిపించ్చి నగరశోధనగా పాళ్యాలు చూస్తారాగా వాలువార్లు ఆడుకొనే వార్తలు- ఉదయమైతే గజపతివారిపాళ్యం మన పాళ్యం మీద పడుతావున్నారనిన్ని అతీతే అయితే కర్నాటకంవారి బలం నిలువదనిన్ని రాయలవారు అప్పాజీమాటలు వినక లోకొచ్చి వచ్చినందువల్ల అపాయం వచ్చెననిన్ని యిందుకు యిప్పుడైనా అప్పాజీ చెప్పినట్టువింట్టే ఆయన అపాయానకు తగ్గ ఉపాయం చింతించ్చగలడనిన్ని అక్కడక్కడ చిన్నపెద్దలు రౌతులు రాణువవారు అనేకలమున్నా ఉత్సాహమగ్నులై అడుకొనేమాటలున్ను వార్లు భీతిజెంద్దిన వార్లున్ను చూచినవారై రాయలవారు అప్పాజీ గుడారమునకు పోయినారు- గనక అప్పాజీ రాయలవారు వచ్చేది జూచి తనవద్దనున్నవార్లు యెరుగకుండ్డ అందరికిన్ని పటకుటీరములకు పొంమ్మని అంపించి తాము నెగళ్ళనికి పోయినట్లు కాయెగనక అంతస్తు గుడారములో రాయలవారిని నిచ్చేశికార్యుండ్డమని రాయలవారితోను ఏకదేశాన నిచ్చేశేటంతకార్యం యేంద్ది అనిన్ని పిలువనంపిస్తే నేను వచ్చి విన్నవం చేయునా అని అన్నందులకు రాయలవారు, తాము ఏకదేశాన రాతగ్గ కార్యం గనక వస్తిమి- అది యేమంట్టె గజపతి దగ్గరనున్న కమలనాథయ్య అంపించ్చిన కాకితం చదువు కొంమ్మని చేతికి యియ్యగా అప్పాజీ ఆ కాకితం చదు

వుక రాయలవారితోను అది యేంద్ది స్వామివారి పాదాపద్మములకు కానంబడ విన్నవంచేస్తివి నా విన్నపము చిత్తానకు తేక కదలి వస్తిరి—గజపతి శీమలో జొచ్చిరాగానే కనమల్లో వచ్చిన అపకీర్తి చాలదా—అవిన్ని విచారించుకోక మున్పై యామడదూరం గజపతి శీమలో చొచ్చి మొదటిస్థలం వద్ద దిగినందువల్ల వారికిన్ని ఆలోచనబుట్టి యింత్త కార్యాలకు తెగవేసినారు— యీ రాత్రి అంద్దుకైన కార్యం కంట్టే కంన్నట్టు కావనప్పటికి అంద్దరికిన్ని యుగంత్ర్యంగ్గినట్టు అవును, అని విన్నపం శేశినందులకు రాయలవారు పలుకరించ్చిన నీతిపద్యం—

క. ముద్దెడు కార్యము( జక్కం
బెద్దెడు మంత్రియును బోర బెదరవిబంటుం
బుట్టరుగా దేవతలకు(
బుట్టరె నానావిధైక భోగసహాయుల్.

అని నీతి చదివి మీరుండగా కొరవ బడనీరేగదా. గతాన మీమాట వినక వచ్చినందువల్ల ఇంత ఆలోచనకు అస్పద మాయను. మాగుణ దోషములు యెంచ్చేటందువల్ల అయ్యేకార్యం యేమి వున్నది. యీ యపాయానకు తగిన ఉపాయం యేరీతు అని అడిగినందులకు అప్పాజి స్వామివారి హృదయమున్ను ఆలోచనామ యేతీరో అని అడిగినంద్దులకు రాయలవారు షోడశపాత్రులున్ను గజపతివారు శేశిన ఆలోచనవల్ల తమకు ప్రాణహానిన్ని మానభంగ్గమున్ను అయిన అవని ప్రజలకు అవధిన్ని వచ్చును అవిన్ని అష్టైశ్వర్యములు—న్ను ఆక్రమింత్తురు అవిన్ని మనస్సుకు నిశ్చయముగా తోంచివున్నవా అని ఆనతిచ్చి మరిన్ని అప్పాజితోను యీసమయమందు యేమి చెప్పబెట్టినా ఉత్తరువు మాకు యీతీరు బుద్దిమార్గముగా చెప్పిన ఆ తీరునవె విని నడిచేము, యింతకు వచ్చినకార్యం శ్రేయప్రయోజనములకు నిలుచునా అని అన్నంద్దులకు అప్పాజీ రాయలవారితో మంత్రనీతులుగా పలుకరింపు శేశిన

పద్యం—

గీ. దండసాధనకృతుల సాధ్యంబుగాక
ప్రింగఁ బిఱితెంచు శత్రువు మిత్రుఁజేయు
దానమున నాత్మవశగులు గానివార
లితరులెవ్వార లీజగత్త్రితయమునను.

క. శత్రుల మిత్రులఁ జేయును
మిత్రుల భృత్యులనుజేయు భృత్యుల నిజపు
త్త్రులుగఁజేయు నందఱ
ధాత్రీపతి కన్నియెడల దానమువలదే

క. ఆయాపదుర్లభమ్మును
నాయాసమునఁ ఘటించు నరయ నభీష్టో
పాయంబు సతికి భేదో
పాయము కడువిష్ఠ మగు నుపాయము గాదే.

అని నీతులు విన్నవించ్చి యీ సమయాన భేదోపాయము సంఘటించ్చి జయించ్చే యత్నం గనవలెనని గనక అనర్ఘ్యమైన భూషణములు బహువుగా వెచ్చపెట్టి హానికార్యము రాకుండ్డా నడిపించ్చవలెను, అన్నింట్టిలకు రాయలవారు నత్తోపాయమ్ముల చేతనున్ను యీసారి గడిపిస్తే బాలును. అని అప్పాజితో అనతిచ్చి తామున్ను బొక్కసభండ్డారములున్ను యేనుగ గుఱ్ఱాలున్ను తాజీవ రాష్ట్రిములున్ను కోట కొత్తళాలున్ను గ్రామ భూములున్ను సకలమున్ను మీయొక్క అధీనం గనక మీరు సరిపోయినట్టు నడిపించుకొంట్టా అన్నిత్రికరణత్రివాచకముగా నలకరించ్చి నగరికి వచ్చిరి గనక అప్పాజివారు తోడుతోనె నగరి గుడారమునకువచ్చి తమకు ఆప్తులైన అయ్యమరసు కొండమరసు రాయసం వీరమరసు అనన్తరం లక్ష్మీపతి మొదలయిన నియోగులున్ను రాయకరణీకం కొంమ్మి దిమ్మపతులవారున్ను బొక్కసంగొల్ల కామారస్వామిదిన్ని రప్పిం

చ్చుక యేకాంతమని వదంత్తి పుట్టింప్చుక వాకిటి గొల్లలతోను గజపతి వారి తెగ మబద్ది మొదలయిన నియ్యోగులు యెవరువచ్చినా యేకాంతమని చెప్పి లోనికి రానియ్యక తిరుగా వెలి వెళ్ళిపోనియ్యక నిలుపక పుండ్డమని తాకీతుగా పలకరించ్చి రాయసం వారితోను షోడశపాత్రులకున్ను పేరు వరుసలకున్ను వరుసలాను మేము పలుకరించ్చిన క్రమం రాయలదేవునివారి సమీపములుగా వ్రాయమని పలుకరించ్చి నిరూప వక్కణ చెప్పినక్రమం.... మీరు అంప్పించ్చిన కాకితములు చూచుకొంట్టిమి గనక అంద్దలి పయనం గజపతివారు ఆదియందు మమ్మునసాడిన మాటలున్ను నడపించ్చు మర్యాదలున్ను రాష్ట్రదుర్గబహుమానముల కొరకు వారివారితో ఆడుకొన్న వార్త్తలున్ను జన్మజన్మానికిన్ని మరవ తగ్గదిలే దనింన్ని అందుకు ఉపమానముగా నీతికార్యమునకు పద్యం-

క. తనువున నాటిన యలుగుల
నమవునఁ బుచ్చంగవచ్చు నతినిష్ఠురతఁ
మనమున నాటిన మాటలు
విను మెన్నియుపాయములను వెడలునె యధిపా.

అని నీతిసహితముగా వ్రాసీ యీరాత్రి గజపతివారితో వార్త్తలాడివస్త్తిమి. రేపు ఉదయావకు పాళ్యంమీటికి పారి మార్గముగా వచ్చేటట్టు తోడకవచ్చి చేపట్టుగాపట్టి ఇత్త్రేము తాము రాయలవారు ధరియించు వెంన ముద్ద కంతమాల నవరత్నపు చిల్లుకతాళి-వైడూర్యతాళి వజ్రాలపరిసెణ మరక తకంక్కణం హారుమంజ్జి-ముత్యాలపచ్చసర ఇంద్రనీలపతకట్టం వజ్ర పులిశ్శం మొలతాడు కెంపులజము దాడిం ముత్యాల-కాలిపెండ్యం వజ్రాలబాహాపురీ రొద్దముత్యాల అద్దత్త్తి నవరత్నఖేడ్యం నవరత్నపు పింప్పాలలాకుం ముత్యాలముంగరంబు యివి మొదలైన పదారు నగ లున్ను అరుపై నాలుగులక్షల ఘట్లాక్రయం తామ అంప్పిత్తేము తమ మనస్సు పద్ధతికి అనుకూలతగనే-నడిపించ్చేము అని మాకు వ్రాసి అంప్పించ్చినక్రమం- యీ పహారు నగలున్ను అరుపైనాలుగు లక్షల

క్రయం గనక కనుగొంన్న నగలు అంప్పితిమి గనుక తమతమకు కావలశిన నగలు తీసుకొని మాకు కావలశిన వస్త్రియోజనం వానగూర్చి అంప్పించ్చేది. అని వివరముగా షోడశపాత్రులకున్ను ప్రత్యేక ప్రత్యేకముగా విరువములు వ్రాయించ్చి మరిన్ని భూషణములున్ను ఉడుగరలున్ను పదారుపెట్టెలు గట్టించి పదార్గురు వియ్యోగులకున్ను నయనం శేశి పదారుగురు మనుష్యుల వశాల పెట్టెల యిచ్చి షోడశపాత్రులున్ను యెదకుపోయి యిచ్చి రమ్మనేటట్టుగా అంప్పించ్చి వియ్యోగులకు వుడుగర వక్కలాకులు ఇచ్చి పొయ్యేటప్పుడు మార్గాన యెవరైన అర్థగించ్చి రమ్మంట్టె అవుగామలనంగ మొదటిదొర వద్దికైనా పోయి వారితోను కలర్ధం కామనద తెలుపమనంగా గజపతివారు యేమని ఆనతిచ్చిన విని రమ్మనేటట్టుగా బుద్ధిమార్గములుగా చెప్పి అంప్పిన పర్యాయములు పీని గజపతివారికి మబుద్ధి అనే వియ్యోగి వ్రాశి అంప్పినది. మీరు కర్నాటకంవారిమీద కార్యం శేశేవారై షోడశపాత్రులను విలువ పంప్పించ్చి వారితో యీ సంస్థానం అదిమంద్దిన్ని మీవల్లగదా వివాహ కావకూ వచ్చినది. మేము పయిడు బియ్యమువారము, కదమబాగ్య మంత్ర మీదిన్ని రవుతు రాణువమీదిన్ని అని ఉపచారోక్తులుగాను గతము మేము నేర్చి నేరక అడిన మాటలు యేమైనా గలిగితే మరచి వివాహమునకు శేవలెను అని మంద్దలించ్చగావారు రేపు ఉదయాంన్నే అంన్ని కార్యములుంన్ను చూచేరు అని విజ్ఞాపనంశాయగా మీరు వారి మాటమీద కార్యమునకు వస్తావున్నారు గనక కర్నాటకం పొళ్యాన మంద్ది మనపొళ్యానకు వచ్చేమార్గాన అత్తులయిన వాల్లకు మంచ్చి వియ్యోగులున్ను పెట్టలున్ను సముఖానకు తెప్పించుక జాడగా వివర్చినమైతేను అంద్దుకు తగిన అలోచన శనేదని వ్రాసి అంప్పగా అకాశితం గజపతివారు చదువుకొని ఆ తీరుననే యిక్కడి వారికి వొకవియ్యగా షోడశపాత్రులకు ఆవర్ష్యైమై భూషణములు పెట్యెల కట్టించ్చి వియ్యోగులనున్ను పదారు పెట్యెలున్ను చేపట్టుగా పట్టుకపోయి గజపతివారి ముంద్దర విడిచివారు గనక గజపతివారు పెట్టల విడిపించ్చి వారి వారి

పేరట వ్రాసిన నిరూపములున్ను చదివించ్చుకొని వక్కాణలు విని ఆదియందు తాము అగ్రగహబడిన కార్యములుంన్ను వుటంగ్గించి అందుకు ప్రత్యుత్తరమున్ను అపర్యాశిమైన భూషణములున్ను విదర్శనంగ్గా జూచి షోడశపాత్రులను నమ్మి జగడాలకు పోతావుంట్టిమి వాళ్లు ఇంత ద్రోహా ఎకు లోనైరి మనపాలింట్టి జగన్నాధులకృపవల్ల మునకలుగా హెచ్చరిక పడితి. ఇకను యెవ్వరిని నమ్మరాదు. అని వచ్చిన పదారు నియ్యోగులున్నంన్ను పట్ణం విడిచి యెకదేశాన అవ్వలవీధతోలి గజపతి వారు యేదెనిమిది ఆమడవీడవు ఉత్తరంగా పారిపోయిరి. గనక మరుచునాడు ఉదయాన షోడశపాత్రులు ఆఇత్తపడి వచ్చి నగరివాకిట నిలిచి గజపతివారిని బయలుమెరశిరమ్మని ఫణిహారులతో చెప్పి అంప్పగా గజపతివారు నగరివాకిట పిన్నపెద్దలతో చెప్పిపోయినారు - గనక వారు వాకిలి వెళ్ళివచ్చి గజపతివారు నడిపించ్చిన కార్యమున్ను ప్రఛన్న వేషముగా పోయిన మార్గాలున్ను తెలువఁగా షోడశపాత్రులు విని ఉత్సాహమగ్నులై అలోచనకులోనై గజపతివారు వున్నతావుకు పోయినాను అపవాదం, కార్యముఖానకు పోయినప్పటికింన్ని వారు నడపించ్చిన కార్యం మంత్రభిన్నం ఆయ గనక తెంపుగా నడిపించ్చిరింత్తెగా నగరికి హిత వాచరించ్చిన వారుకారు, అని అందుకు తర్వాత తామే తెలుసుకొనేరు, అని వారువాల్లున తమతమ దుర్గాలకు పాగిపోఇనారు. కాబట్టి కృష్ణరాయలవారు యీ వర్తమానములువిని జయభేరిశాయంగా మొదటి స్థలానకువచ్చి నిలిచి యెవ్వరున్ను నగరు చేరకుండ సుబుద్ధిగారి మనుష్యుల కోటవాకిళ్ళనుంన్ను పట్టణములోనున్ను నగరిమహాలునున్ను జతనంగా మనుష్యుల వుంణ్డమని నియమించ్చి పోట్లూరి సింహాద్రివద్ద జయస్తంభము శేయించ్చి సుబుద్ధిని బిలువనంప్పి ఆయనతోను మేము ప్రతాపముకొరకు వచ్చినవారమింత్తె కాని రాజ్యాపేక్షకొరకు వచ్చినవారముగాము, గజపతివారి రాజ్యం గజపతికే నడిపించ్చేము, మేమున్ను మాశిమకు పాగిపొయ్యేము, అని ఆనతియ్యగా సుబుద్ధి ఆ వివరములకు గజపతివారికి అనుపూర్వకముగా కాకితం వ్రాసి వంప్పినారు. గనక

బుద్ధిశాలి యైనటువంట్టి గజపతివారు ఆకాశితము చదువుక చాలా సంతోషపరులై తిరుగా పట్నానకువచ్చి ఖోరశపాత్రులవల్లి తప్పితం లేదని విచారించ్చుక వారులటాశ పిలుపవంప్పించ్చగా వారులున్ను వచ్చి కని కొలిచిరి. గనక మీవల్ల కపటమున్ను లేదు. ద్రోహచింతనాను లేది— అని పలుకరించ్చి వారలకు బహుమానములు శేశి వారల కూర్చుక రాయలవారిని సందేహించ్చక మాటవలుకులాడేటప్పుడు గజపతివారు రాయలదేవునితోను సమయోచితముగా పలుకరించ్చివండ్డులకు—

శ్లో. నష్టం కులం ఛిన్నతటాకకూపాన్
విభ్రష్ట రాజ్యం శరణాగతంచ
గోబ్రాహ్మణాన్ దేవగణాలయాంశ్చ
యదుద్ధరే త్పూర్వచతుర్గుణం తత్.

అని శ్లోకం చదివి మరింన్ని ఉచితమైన మాటపలుకులాడంగ్గా రాయలవారు గజపతివారితోను మీరనిన్ని మేమనింన్ని భేదము ఉన్నదా అని ఉపచారములుగా మాటలాడి గజపతివారికి చాలా బహుమానసన్మానములు శేశి నాలుగు నగల కోకతాకలున్ను యిచ్చివారు. గనక గజపతివారు తమ కొమార్తె అయిన జగన్మోహినీ అనే కన్యకను ధారవోశి యిచ్చే సమయాన చెప్పిన పద్యం.

క. హాటకపేటీ శాటీ, ఘోటీశకటీమదేభకోటీపీటీ
పేటీభృచ్చేటీ....మయూరికలు....వేడ్కన్.

అని పీఠిచదివి ఆవలమరింన్ని అల్లుడికింన్ని అరుణిద్దైకున్ను యియ్యతగిన బహుమానోచిత క్రమభూషణాలనింన్ని అంప్పించ్చి మరిన్ని తమ తమ కొమార్తెకు పట్టుపరిమెళ వసువులకని కృష్ణవేణికి దక్షిణపుదిక్కున నడిచే రాజ్యాలున్ను కోటకొత్తళములున్ను దుర్గాలున్ను ఇచ్చి యేనుగ గుఱ్ఱములు బంటుపరివారం దాసామదాసులు అందోళిక హోయలు బండ్లు వనలంప్రాయలు పాత్రసామగ్రిలు నగదపుకాళ్ళమంచము హంసతూలికా

యివి మొదలైనవిగా అదలిద్యేలకు యియ్యాతగ్గ వరునలన్ని యిచ్చి అల్లునికిన్ని శాయతగ్గ వరిశలు అన్నివిన్ని తప్పకుండా వకపారి గానె సకలపదార్థములున్ను యిప్పించ్చి తమ నగరగల భూషణములలో అపూర్వమైన హెచ్చుబడిన నవరత్నభూషణాదులు అపరిమితముగా ఇచ్చి అప్పాజీ షోడశపాత్రులకు అంప్పించ్చిన పదారు నగల నవరత్నపొడి సొమ్ములు యిచ్చి, చీని చీనాంబరమైన పట్టుపతావళ్ళు పీతాంబరాదిగాగల సకలమైన కోశశాకలున్ను యిచ్చి యేనుగ గుర్రం కత్తి కేడం మొదలుగా గల రాజోపచారమైన బహుమానములున్ను యిచ్చి విందు వీడుకళ్లు ప్రసాదించశేయించ్చి సుబుద్ధినిన్ని వెంబ్బడికూర్చి అంప్పగా రాయలవారు అత్యంత సంతోషయుక్తులై నగారాశేయమని గజారోహలై అప్పాజి సుబుద్ధినికూడా చౌడోలున వుంచ్చుకొని బయలుదేరిరాగా యీపర్యాయములన్ని౦న్ని గోలకొండ విజయాపురం అహముదానగరం యేలే ముగ్గురు దుసేదార్లున్ను విని యిఖను మనం రాయల దేవునితో యెదిరించ్చి కత్తి కట్టేది కార్యం కాదు, అని యోచనచేసి భేటిశేసుకోవలెనని నిశ్చయించి అందుకు అయిన సంవిధాన పురస్సరముగా వచ్చి నిలిచి సవినయంబ్బుగా కుర్నీసులు శేశి రాయలవారి భేటిశేసుకొని కానుక నదురుదెచ్చి అపరిమితముగా పాదముల సమర్పించ్చి భయబుద్ధిగలిగి రాయలవారియొక్క-దానశౌత్రములు తెలుసుకొని పలుకరింప్పశేశిన నీతిపద్యం-

చ. మలకలు మాత్రపచారములు మామకము ద్వేషవహ్నిఘోరముల్?
ఖలులము రోషజాతులము గర్వుల మేమొకమంచివారమే?
పలినదశాక్ష ప్రాణులకు నైజగుణంబులు మాన్పవచ్చునే?
వెలయఁగ మావికారములు వేయుచు నెంచఁగవేలభూవరా?

అని నీతిపద్యం చదివి అన్యోన్యమైన మాట పలుకులు నడిపించ్చి తమ తమ దేశాలకు సరుదులు యేర్పాటు శేశుకొని కసమని కొలిచేవారై రాయలవారిచేత అంప్పించ్చుక వారివారి స్థలాదులకు పోయినారు. గనక

కృష్ణరాయలవారు ఉత్తరాదితురకల కార్యం జయం చేసుకొని శీఘ్రమై తిరిగి తిరుపతికి రాంగా కల్యాణ కటుబరిగె కోటలవారు గర్వితులై కోట మీదనుండి కూతలింగ్గా ఆవార్తలు రాయలవారు విని యెదిరి తెగవారిని అడుగగా మ్లేచ్ఛుల తెగవారు వున్నారు గనక కోటమీదికై అంద్దల మగుటించ్చ మని కటుబరగ కోట లగ్గ బెట్టించ్చి మూడు ముక్కాలు ఘడియలలో కోటసాధించి ఆకోటలోవున్న యజమానుండ్ల చేపట్టుగా పట్టుకొని ఆరువేల గుఱ్ఱాలవారినిన్ని గుఱ్ఱాలున్ను ఏకవాగెగా బట్టుకొని ఆకోటకు శాణ్యం గుజ్జరి కల్యాణరావును వుంచ్చి తిరుపతికి వచ్చి అలమేలుమంగా సమేతులైన కల్యాణ వెంకటేశ్వరుల దర్శనంబు సేసి రొక్క రూపాయలు కానుకసేసి సకల భూషణములున్ను స్వామికి సమర్పించ్చి అస్థలాన షోడశమహాదానాలున్ను సేసి సంన్నిధిని నిత్యసేవగా అంజలిపుటులై పూర్వద్వార మండలి పుడయపార్శ్వములా తిరుమలదేవీ చిన్నాదేవీ సహితంగా వుండేటట్టుగా తాంమ్రాన ప్రతిబింబమున సేయించ్చి స్వామిని యెదురుగా నిలిపి అంద్దుండ్డి కాళహస్తికివచ్చి స్వామిని దర్శించి కానుకలున్ను నవరత్నాభరణములున్ను సమర్పించి శ్రీముఖనంవత్సరం ఆశ్వీజ శుద్ధ ౧౦ దినములు రాదిగాగల వస్త్రములున్ను గ్రామాదులున్ను సమర్పించి స్వామి సన్నిధిని షోడశ మహాదానములున్ను సేసి అవార్యశిగా సత్రములున్ను గలుగసేసి అంద్దుండ్డి త్రిపురుల చేత పూజకొన్న మూడు స్థలాలకున్ను బోయిన స్వామి దర్శనం సేసి నంద్దీశ్వర దర్శనం సేసి అరగరుగుడిక్కి వచ్చి సేవించ్చి కానుకలున్ను ముత్యాల కిరీటం పచ్చలపతకం సమర్పించ్చి మధురకు వచ్చి మీనాక్షి దేవినిన్ని చొక్కనాథస్వామినిన్ని త్రిసంధ్యాలం యంద్దున్ను సేవించ్చి కానుకలు సేసి అనేక భూషణములు సమర్పించ్చి అమ్మవారిక్కి వజ్రాల కంమ్మలున్ను వైడూర్యపు పతకములున్ను పచ్చల కంమ్మలున్ను ముత్యపు ముక్కరానున్ను సమర్పించ్చి త్రిరాత్రములు వాసముజేసి శ్రీవల్లిపుత్తూరికి వచ్చి చూడుకొడుత్తనాచ్చారు సమేతముగా సంపెంగ్గి మంన్నారు స్వామిని సేవించ్చి తిరుముక్కు

కెంపుల పొళ్ళాణం బంగ్గారు మాపురములున్ను నవరత్నకీలితమైన సింహ్మాముఖం ప్రభలున్ను సమర్పించ్చి గుంట్టతొప్పించ్చి రాతికట్టానకున్ను పడిమిమంట్టపానకున్ను లక్ష మాళ్ళు యిప్పించ్చి కరువనల్లూరికి వచ్చి క్షీరవర్ణస్వామిని దర్శించ్చుక శంకరనారాయణ దేవస్థానకువచ్చి నాగతీర్థమున స్నానం శేశి గోమతీసమేతముగా శంకరనారాయణస్వామిని దర్శించ్చి దక్షిణకాశికిపోయి త్రికూటాచలమంద్దు ఆకాశగంగయంద్దలి స్నానం శేశి చిత్రసభ శేవించ్చుక అగస్త్యపర్వతానకువచ్చి కల్యాణతీర్థమంద్దలి స్నానం శేశి అగస్తేశ్వరుని గోపుర గట్టించ్చి గజేంద్రమోక్షానకు వచ్చి స్వామిని సేవించ్చుక శాలివటపురానకు వచ్చి కాంత్తిమతీసమేతముగా వేణువనేశ్వరస్వామిని దర్శనం శేశి తామ్రసభ కట్టించ్చేటంద్దుకు కొంత్త రూకయిచ్చి కృష్ణరాయసముద్రమని తన పేర అగ్రహారముగాచించ్చి తోతాద్రి స్వామిని శేవించ్చుక కురుంగ్గుడికి పోయి పంచ్చనంబ్బులమంన్ను శేవించ్చి కన్యాకుమారికిజని అమ్మవారికి సేవించ్చుక శ్రీకంద్దూరికి వచ్చి వల్లి దేవయానసమేతముగా సుబ్రంహ్మణ్యస్వామిని శేవించ్చి నవ తిరుపతులకు వచ్చి ఆయా స్థలాదులకు దగిన నవరత్నపొడి భూషణాదులు యిచ్చి ఆదిసేతువుకుపోయి రఘునాయకుల సేవించ్చి కాశములమీద సముద్రతరణమై ధనుష్కోటిలో ఖడ్గంగడిగి సేతుస్నానం తులాపురుషదానం మొదలైన దానాలాచరించ్చి కాశివిశ్వేశ్వరులమంన్ను రామలింగ్గస్వామినిన్ని సేతుమాధవస్వామినిన్ని పర్వతవర్ధన అమ్మవారినిన్ని సేవించ్చుకొని చతుర్వింశతి తీర్థములయంద్దు స్నానం శేశి కోటిగోదానం కోటిబ్రాహ్మణులకు అన్నదానము శేశి స్వామి సంన్నిధిని మూడుతులలుతూగి అంమ్మవార్కి సకలాభరణములున్ను నవరత్నపొడిగా యిచ్చి త్రిరాత్రి వసిఇంచి కోటితీర్థస్నానం శేశి స్వామి చేత అంన్పించ్చుకొని మరలినవారై గోకర్ణస్థలమునకువచ్చి బృహదంబ్బాసమేతముగా గోకర్ణేశ్వరుని సేవించి వకుళవన ప్రదక్షణము శేశి గోకర్ణతీర్థమంద్దున్ను మంకణతీర్థమందున్ను స్నానం శేశి అంమ్మవార్కి సకలాభరణములుంన్ను సమర్పించ్చి శ్రీరంగ్గపట్నానికి వచ్చి ఆది

రంగ్గనాయకుల సేవించ్చి సముహూర్తమందలి విద్యానగరప్రవేశమై విఠల విరూపాక్షుల సేవించ్చి కానుకలున్ను అనర్ఘ్యమైనటువంటి భూషణాదులున్ను సమర్పించ్చి నగరుప్రవేశమై పెద్దలకు మ్రొక్కి సుముహూర్తమున సింహాసనమునకు విజయంచేసి అప్పాజీ మొదలైన సకలసామంతులున్ను అల్లుడికొమాళ్ళున్ను రప్పించ్చుక విందుకొలువిచ్చి అప్పాజీని రత్నకంబ్బళియందు కూర్చుండబెట్టి రత్నాభిషేకం స్వర్ణాభిషేకం చేసి నాలుగునగల కోకతాకలున్ను యిచ్చి చైవరాలున్ను పచ్చల కడియాలు తాళిచౌకట్లు పచ్చలపొంట్లు ముత్యాల తురాయి వజ్రాల కంఠసరం కెంప్పుల వుంగ్గరములు యివి మొదలైన భూషణములున్ను యిచ్చి గంధకస్తూరి తట్టుపునుగు జవ్వాజి మొదలైన పరిమళముల చాతలెప్పాయిగా బహుమానములు చేసి తక్కినవార్లకెల్ల తగుపాటి బహుమానములు చేసి సకలవాద్య ఘోషములతోడను గజారోహణాలచేసి యిండ్లకు అంపించి అటుపిమ్మట దొరమన్నెవార్లు రౌతురాజువ ప్రభుసాహ్యగార్లు అమరనాయకంవార్లు బోయనాకంవార్లున్ను కైజీతం వార్లను నియోగులను కరణీకులను రాయసాలవార్లను దినసరివార్లను విద్వజ్జనులను కవిజనులను నాటకాలంకారులను దైవజ్ఞులు భిషజులు రవుతులు స్థానపతులు ఆశ్రితులు భాగవతులు మొదలయిన దెబ్బై రెండ్డు నియోగాల వారికిన్ని వుడుగర సక్కలాతులున్ను యిచ్చి ఆదరణగా ఆనతిచ్చి అంప్పించినవారై మరుచునాడు కొలువులోపల యిష్టకథావినోదమైన నగరి నియోగులున్ను కవీశ్వరులు విద్వాంసులు మొదలైన విందుసభలోన సాళువ తిమ్మరసయ్యగారున్ను రాయసం కొండమరసయ్య మొదలైన వార్లున్ను ప్రసంగ్గం వెంబ్బడిని అంద్దరున్ను యెంచ్చినట్లు కవితాచాతుర్యము గలవార్లున్ను రాయలవారిని జూచి ప్రసంగ్గం వెంబ్బడిని అంద్దరున్ను యెంచ్చినట్లు కవితాచాతుర్యము గలవార్లున్ను రాయలవారిని జూచి ప్రసంగ్గం వెంబ్బడిని నీదుకీర్తి శాశ్వతముగా నిలిచేటంద్దులకు ఆదియంద్దు అవనీపతులు కృతులంద్దుచు రాంగా వార్లున్ను ప్రతాపములున్ను కీర్తించ్చి అంద్దరున్ను యెంచ్చినట్లు స్వామివారున్ను కృతులంద్దు

కొండ్తే కీర్తిప్రతాపములు శాశ్వతముగా నిలుచున గనక తిమ్మరసయ్య అయ్యామరసయ్య కొండమరసయ్య బాచరసు తిప్పరసు అయ్యామరసు మొదలైనవార్లు దెలుపగా రాయలవారున్ను చాలా సంతోషబడి ముక్కుతిమ్మయ్య అల్లసాని పెద్దయ్య మాదసగారి మల్లయ్య మొదలైన కవీశ్వరులతో కృతులంద్దుకోవలెనని కవితానాయకులతో పలుకరించ్చి అతిరున అయ్యాని ఆనంగా కుళ్ళాయి కబ్బాయి తాళి చౌకట్లు చేసరి పేరులు కోకతాకలు యిచ్చి పారిజాతాపహరణమున్ను మనుచరిత్రాను చెప్పుమని ఆనతిచ్చినారు. గనక స్వామివారికి యీవరకు నడుచు సమాచారములకు వ్రాశి అంప్పించ్చినారు తర్వాత నడుచు సమాచారములకు వెంబ్డిగా విన్నవించ్చి అంప్పుతున్నాను కనక స్వామివారి పాదారవింద్దములయంద్దు నిరంత్తరభక్తి యిచ్చి రక్షింప్పగలది. యీ రాయవాచకం చదివినవార్లకును వింన్న వార్లకున్ను బుద్ధివివేక విచక్షణములు గలిగి భాగ్యవంత్తులై యోగశాలులై ఆచంద్రార్కస్థాయిగా సుఖాన వుంద్దురు. శ్రీరామార్పణమస్తు శ్రీరామజయం,

రాయవాచకము సమాప్తము.

---

# అనుబంధం 1 : పదవివరణ

అంగజాదులు (31:1): "గుర్రాలకు......పదారుగురు అంగజాదులనున్న" అంగజాలులు = కావలివారు, అంగరక్షకులు (సూ. ని.) అయితేంత పచ్చరు. ఇచట అంగమర్దుడు (ఒడలు పట్టెడువాడు) అను అర్థమున వాడినట్లున్నది.

అంద్దుపడి (63:24). అందుబడి = సమీపము.

అఘపురం (49 15) 'ఆగ్రా' అని నేలటూరు వెంకటరమణయ్య, చూడు : కృ.దే.రా, పు 105

అడ్డబడి (27.4,3 21). అడ్డపడు, అడ్డము వచ్చు- అని. శ.ర, సూ,ని. కాని ఇచట 'సాష్టాంగపడు' అను అర్థమున వాడబడినది.

అణ్ణగర్లు (26·6,27·7). (త. అన్నగన్, పేడి) కంచుకి, వేత్రహస్తుడు (సూ.ని.)

అధర్మపేతులు (40:25) : అధర్మమునకు పతులు, అధర్మవర్తనులు అను అర్థమున వాడినది.

అర పేద, కాలు పేద (42:26) : ఇది తెలుగు, పారశీ మిశ్ర సమాసము. ప్యాదా అనే పారశీ పదానికి వికృతి పేద. కాలినడకవాడు, కాలిబంటు అని అర్థము. అర = సగము, కాలు = పాతిక. బలహీనులు అను అర్థమున వాడినది. అర్థ రథుడు అన్నట్లు. చూడు, గో. కృ, పు. 44 పేద = పై. వి. భటుడు, అని శ.ర.

6)

పేద = (from Skt పదాతి) n a foot-soldier, భటుడు అని బ్రౌ.ని, ప్యాదా n s for Piyaadah, a peon of footman (బ్రౌ మిశ్ర)

అంబాలపడి (69 6). సందర్భాన్ని బట్టి 'ధీటి చెంది' అను అర్థము సరిపోవును. నిఘంటువులలో ఈ పదము లేదు

అవుగాములు (73 9) "అవుగాములనంగి"-అవుగాము లనక, అవును, కాదు అనక.

ఆము స్తీదు (28 23) చూడు ము స్తీదు

ఆయాలాయం (80 26) (హిం) పిచ్చి, పోయె అను అర్థమున వాడినట్లున్నది. 'ఆయాలాయం గుఱ్రా'లని ఇచట ఈ పదం గుఱ్రాలకు విశేషణంగా వాడబడ్డది నిఘంటువులలో లేదు

ఏకవాగె (77:7) "ఆరువేల గుఱ్రాలి వాని నింన్ని గుఱ్రాలనున్ను ఏకవాగెగా పట్టుకొని" సందర్భాన్ని బట్టి 'ఏకవారము' 'ఒకేసారి' అనే అర్థము వస్తుంది మిశ్రసమాసమని తోస్తుంది 'వాగె'కు నిఘంటువులలో ఈ క్రింది అర్థాలు కనబడితాయి.

వాగె, వాగ, వాగియ, (Skt) గుఱ్రపు కళ్ళెమును తగిలించేవారు (బ్రౌ ని.)

కంధాచారము (29 4) "కంధాచారం కరణాల పిలిపించి" ఈ పదము సూ.ని లలో లేదు. బ్రౌ.ని. ఈ క్రిందివిధంగా అర్థమిచ్చింది

కందాచారము (H and K) n The native militia.
కట్టుబడివాండ్లు ; adj Military దండు సంబంధమైన (బ్రౌ ని)
కాని దీని అర్థము Military Department, సైనిక శాఖ.
(చూడు, వి. స, III, 488, Sstudies, P. 132)

కందాచారము (ఉ) (కందాచార్) (సం. స్కంధావారము) సైన్య సంబంధమైన లెక్కలు వ్రాయుట-శ.ర. అను, పు 98.

కడ్డీ కపళములు (30:26) గడ్డి+కవణములను మారుగా కడ్డీకపళములు అని వాడినట్లున్నది.

కవణము=గుఱ్ఱము మొ॥ వానియొక్క ఉలవలు, దాణా (శ.ర, సూ.ని, బ్రౌ ని.)

కత్తలాణి ( ) కత్తళము సం కర్తలాణః కవచము తొడగిన యశ్వము: అశ్వాది వాహనము అని సూ ని, సం తెల్లని గొరిజ తోక, వెంట్రుకలు గల నల్ల గుఱ్ఱము, కత్తలాని, కర్త్రిలాణము అని శ.ర, దీనికి శ.ర; ఉపతత్పరితాపరిచము ఇంచి నిర్వచనమిచ్చెను, కర్త్రిలాణము (Skt.) n. a black horse having white hoofs and a white tail, కత్తలాని అని బ్రౌ.ని.

కాని ఇది సంస్కృత శబ్దము కాదు. పారశీ నుండి వచ్చిన అన్యదేశ్యము. ఖత్లాన్ దేశపు గుర్రము చూడు గో.కృ. పు. 31, దొణప్ప, భా. బా. వ్యా పు 177-179, పు. 182.

కత్తికట్టిలాలు (54:22) 'కట్టలము' నిఘంటువులో లేదు. 'కట్టనము', 'కట్టడము' అనే పదాలు బంధము, కూర్పు అనే అర్థంలో ఉన్నాయి. (సూ.ని; శ.ర; బ్రౌ.ని.) ఇచట కొమ్మకు వేలాడుతున్న మనుష్యులను క్రిందికి దించుటకు ఉపయోగపడు త్రాళ్ళ కూర్పుగా కనపడును.

కప్పణాలవారు (44:18; 57:18) : కంపణాలవారు; కంపణము దేశవిభాగము. క్రింద ''వారి బాణంతా మాష్క'' చూచునది.

కబాయి, కబ్బాయి (30.6, 39·17, 55.26, 68:14, 80:6) కబాయి or కబాయీ (H) n. A shirt, an ornamental garment

(బ్రౌ. ని), కబాయి (యా) కబ్బాయి (హిం కబా క. కబాయి తా కపాయి) అంగీ (సూ.ని), కబాయి (దే)-అంగీ (శ ర.)- ఇది అన్య దేశ్యము శబ్దరత్నాకరకారుడు దేశ్యమన్నాడు. దొణప్పగారు కబాయిని తురకీయ నుడులలోనికిగా చెప్పినారు చూడు దొణప్ప, భా చా వ్యా. పు. 263, కబాయి or కపాయి n. s. Kaba, a shirt, an ornament garment, కపాయి for n. s Qaba : తురకలు తొడిగేపొడ చొక్కా (బ్రౌ మి శ్రి, పు 18, 17).

కప్పిలి వారులు (80 8). సందర్భాన్ని బట్టి "కబ్బిలి" అనేది ఒక దేశ నామమో, లేదా జాతి నామమో అయి ఉండవలెను నిఘంటువులన్నిటిలో, కప్పిలి=పిల్లమ్మువాడు (శ. ర), (సూ ని), A toddy seller (బ్రౌ.ని.) అని అర్థము ఇచ్చి ఉన్నది

కరసుం [55 20] వస్మృతి 'కరము' అను రూపము శ ర ,సూ.ని లలో లేదు బ్రౌ.ని లో ఉంది

కర్తారు, కర్తరు [40 9, 51 1] కర్తారు [డు] (హిం కర్తార్). 1 తురుష్కులదేవుడు (అల్లా) 2. సూర్యునకు తురుష్కభాషానామము. అని సూ.ని, బ్రౌ.ని.లో లేదు. ఈ పదాన్ని గూర్చి గోపాలకృష్ణరావుగారు ఇట్లా వ్రాశారు : ఈ పదము ముస్లిము దేవతను సూచించునని శ్రీ సుర వరము ప్రతాపరెడ్డిగారు అనుమానించిరి చదలవాడ మల్లన ప్రయోగము "కర్తారుండనుచుం దురుష్కులు మొదల్గా గొల్వఁ బ్రత్యక్షమై మార్తాండుండుదయించె" ఇట్టి అనుమానమునకు దారి తీసినది శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు శబ్ద రత్నాకరము అనుబంధమున అన్యదేశ్యముల శబ్దముల అర్థమును వివరించు పట్టి ముస్లిముల దేవుడని భావించిరి. కర్తారుడు ముస్లిం దేవత కాదు. కర్త యను పదమువలన నేర్పడిన రూపము కర్తారుడు = చేయువాడు, భగవంతుడు అని

సామాన్యార్థము, — గో. కృ. పు. 29.; చూడు. "కర్తార" శబ్దం, ఆం. సా. ప. ప, 26 (4), ఈశ్వర, పు. 146 మొ॥; కర్తారుండను పదము హిందీయని కొందఱు. హిందీలో ఇది లేదు 'కర్తృ' ప్రథమా బహువచన రూపము 'కర్తార' సృష్టికర్త సర్వేశ్వరుండని అర్థము.— —రొణప్ప, బా. బా. వ్యా. పు. 194.

"సారెసారెకు) గర్తాలు దూఱువారు". కృ. రా. వి, III. 46;

John Shekspear, A Dictionary of Hindustani and English, Second Ed. 1890 లో ఈ క్రింద చూపినట్లు సంస్కృతభావంగా చెప్పబడింది

S. Kartar (     ) S.M. The creator,an author, doer.

కాళము [78.17] "కాళములమీద సముద్ర తరఙమై". ఇచట కాళము అనగా ఒక విధమైన పడవ అను అర్థము సరిపోవును. ఈ అర్థంలో 'కాళము' అనే పదము నిఘంటువులలో లేదు.

కుతపమలిక [84.5] గోల్కొండ సుల్తాన్ కుతుబ్ షా. 'మలిక' పారసీ 'మలిక్' శబ్ద భవము.

కుర్నీసులు [78.16]. "ఇది కొర్నిష్ అను పారశీక పదము యొక్క రూపము విస్రమ శిరస్కులై రాజునకు ఎదు సార్లు సలాము చేయుట" చూడు. గో కృ. 69.

కూర్నీ సిషేతు(హిం. కూర్నిశాత్), సలాము, వందనము (శ. ర అను. 100).

కుళ్ళాయి [30.6, 80 6] పారశీ. కులాహ్, బట్టటోపి - గో కృ. పు 69 కుల్లా < Desi కులాహ్ = నల్ల గొర్రెపిల్ల తోలుతో కూలినా చేసి

ముస్లిము సాధువులు, దర్వేషులు ధరించెడి టోపి—బొజప్ప, ఘా.చా.వ్యా, పు. 181

కూచి (62:18) "నగారా కూచి రేయించ్చమని'' కూచీ అను (ఫారశీ) పదము కూచి అయినది. దండును ప్రయాణము చేయించుట— గో. కృ, పు. 69: కూచీసేయు (హి కూచ్), దండయాత్ర వెడలు శ ర అను పు. 100, కూచీ (హిం. కూచ్ ) దండయాత్ర (సూ.ని, కూచిచేయు, To march an army (బ్రౌ.ని)

కొత్తవాలు (88. 16,19) "కొత్తవాలు అనే తలారికి'' అని రాయవాచకమే అర్థ వివరణ ఇచ్చింది. ముస్లిం రాజ్యాలలో పోలీసు అధికారి "ముష్కర తురుష్కులవలఁబొమ్మని కొత్వాలు కప్పగింతు'' రని, కృ రా.వి, II.123.

కొనమూకలు [64:2] 'సేనాముఖము' అనే అర్థంలో వాడినట్లున్నది.

కోకతాకలు [75 15, 76:7]. "చీని చీనాంబరమై పట్టు పరావళ్లు పీతాంబరాది గాగల సకలమైన కోక తాకలున్ను" అని రాయరాచకమే అర్థాన్ని వివరించింది. కాని, ఈ ద్వంద సమాసము నిఘంటువులలో లేదు. 'తాక' అనే పదంకూడా లేదు.

కోటకైచీ [58 14] 'కైచీ' కి అర్థం తెలియదు నిఘంటువులలో లేదు అగడ్త అయి ఉండవచ్చు

కంపోలం [64.14] "అలజడి" అను అర్థము వచ్చును. నిఘంటువులలో లేదు

చీటి పాటి చిక్కు చిల్వానములు [35·15]. అర్థం తెలియడంలేదు చిల్వానము, చిల్లాణాము అనగా బాకు (సూ ని ) అయి ఉండవచ్చు.

చెరాజొరా [64:14] "చెరాజొరా బిట్టి ఢాలా కంపోలం చేయంగా" చెరబట్టి, జొరాబట్టి (?) చూడు పైన, కంపోలం. జొరబడా (జొరబడి)

జవురు జంగులు [35.8] "జబురు జంగి ఫిరంగులు" అని కృ.రా.వి, 11. 122 ఒక విధమైన ఫిరంగి (గా.కృ 37; బ్రౌ మిశ్ర, పు. 39.

జీరా [24·18, 55:11] "జీరా సంజ్ఞోక గుఱ్ఱములు"

జీరా. n.s. Zira, Armonr, Nail కవచము బ్రౌ.ని లో ఇది తెలుగు దేశ్య పదంగా చూపబడింది.

జీరా-జిరా (త. సిరా హిం. జీరా) కవచ విశేషము అని సూ.ని. దీనికి తమిళ సంబంధాన్ని చూపించింది.

జీరా-దే వి. కవచము, కవచ విశేషము (అని కొందఱు) అని శ.ర.

జిరా=ఏనుగు లేక అశ్వము మున్నగు వానిపై వేయు వస్త్ర కవచము. ఫా. జీరహ్-గో. కృ. 34, దొణప్ప, భా.పు.వ్యా, 190.

జిరా సంజ్ఞోకం గుఱ్ఱములు, అనగా జిరాతో కప్పిన గుఱ్ఱములు అని అర్థము.

జీరెజు తాళ్ల (60 19) దేరాతాళ్ల 'జీరెజు' నిఘంటువులలో లేదు. బహుశా జీరుకాడు (=త్రేలాడు) తాళ్లయి ఉండవచ్చు. లేక డెరిజా = దేరా తాళ్లయి ఉండవచ్చు. చూడు క్రింద 'డెరిజా'

డెరిజా (60 18) = 35 20, 86:1, 87·4,8.

దేరా-ఈ రూపము నిఘంటువులలో లేదు.

తాకీదు (72:4) తకీద్ (ఫా) ఆజ్ఞాపత్రిక బ్రౌ మిశ్ర. 44.

దాదిమహాలు (32:21) న్యాయసభా భవనము-గో కృ 39.

దిన ప్రతింగ్న (5 27) ప్రతిదినము.

రాయవాచకము

దునేదార్లు (దలు) (27:16, 65:24, 67 8, 76 13) పర-(49 14) "గోల కొండ, విజయాపురం, అహముదానగరం యేలే ముగ్గురు దునేదార్లు"- ఈ వాక్యంలో ప్రభువులు (సూ.ని )అనే అర్థం సరిపోతుంది; కత్తి చేత ధరించిన శూరుడు (శ.ర.);

దునియాదార్=మంచి వ్యవహర్త, చతురుడైనవాడు, శూరుడు. పూర్వ కావ్యము లందు రెండువైపుల పదునైన కత్తి అను అర్థమున ప్రయుక్తమైన పదము-గో.కృ. 56.

నగారా (58:10, 61.16) నఖారా అను పదమునకు వికృతి, గో.కృ. 69 బ్రౌ.మిశ్ర, 57.

నదురు ( ) కానుక. నజీర్ అను పదానికి వికృతి - గో కృ. 69.; బ్రౌ.మిశ్ర పు. 57.

నల్ల ప్రజ (31:3) : కిరాతక సంఘము, ఆటవిక జనము (సూ ని ) శ ర. లో లేదు. చూడు, నేలటూరు వెంకట రమణయ్య, 'నల్లప్రజ', భారతి, 1938, డిశంబరు, పు. 663. సైన్యములోని బోయవారు

నామజాదులు (36:19, 37:23: 39-26; 40 3, 41 16) ఈ పదం. శ.ర, సూ.ని., బ్రౌ ని లలో లేదు బ్రౌ.మిశ్ర లో కూడా లేదు "నాజ్మద్ అను పారశీక పదమునకు పేరుపొందిన, పేర్కొనబడిన అను అర్థములు కలవు నాజ్మద్ కర్‌నా అనగా నియోగించుట; ఇట నియోగింపబడినవారు అను అర్థమునందు "నామజాడు" అను పదము ప్రయోగింపబడినది" –గో.కృ పు 68, మోదేకుర్తి సత్య నారాయణ, "తెలుగు శాసనాలలో అన్య దేశ్యాలు," భారతి, 1959, అక్టో, పు 69,

నిశానులు (61.16) : టెక్కెములు-గో.కృ 69; Nishan-Flag, banner. ఝుండా. బ్రౌ.మిశ్ర. పు. 600

పట్టీ, పట్టె (59:17; 8:7) "రామలింగనమ నాయనికి పట్టీలు ఇచ్చి." గో.కృ. పు. 69 లో దీనిని ఫారశీ పదంగా తంచి, పట్టీ = జాబితా అని అర్థం చెప్పారు. కాని ఇక్కడ దీని అర్థము "తమలపాకు పట్టీ" అని. ఒక నియోగానికి (Commission) కు ముందు ఇట్టి పట్టీలిచ్చుట ఆచారము, చూడు, రా.వా. (8:17), "పట్టెలు", పట్టెలు, ఆభరణ విశేషములని కులశేఖరరావు, ఆం.వచ.వాఙ్మ, పు. 517.

పదునెనిమిది రేవులు (4 6) కౌటిలీయార్థ శాస్త్రంలో చెప్పిన 18 ప్రభుత్వ శాఖలు (?) అష్టాదశ తీర్థములు.

పయదు బియ్యము వారు (69:9; 78 15) · పడి బియ్యము వారు-పరిమితాప సరములు కలిగినవారు అను అర్థమున వాడినట్లున్నది.

పరదునేదార్లు 49:14 శత్రురాజులు. చూడుదునేదార్లు.

పర భారకం (12.19). మిక్కిలి భారము

పరాకు (18 25) ఉపేక్ష, నిర్లక్ష్యము.

పాయు (య) దళము (87:5; 68.2) "మూడు లక్షల పాయదళము." పాద దళమా ? Foot-Soidiers ?

ప్రతిచింత (28:11) : తిరుగు ఆలోచన, సరియైన ఆలోచన.

ప్రహరి బడగరము (8:13) : ప్రహరి = కోట ప్రాకారము· బడగరము (?) = అగడ్త (?) బడగరములు = ఆటవిక జాతియోధులని కులశేఖరరావు. ఆం.వచ.వాఙ్మ, పు. 517.

బంటు బయదలు (25:8; 28:23) – బయదకాలు (47.24) బంటు పైద-(ప్యాదా అను పదమునకు వికృతి పైద), కాలినడక వాడు, (Foot soldier) అయి ఉండవచ్చు. ఏకార్థక పదములు జంటగా ప్రయోగించుట :- చూడు గో కృ. 44.

రాయవాచకము

బలమించ్చి (34:14). బలముతో అధిగమించి.

భయిరవాసలు (49.28) బహిర్ + వాసము, పై గుడ్డ ; అధివాసము.

భారవసము (38.14) భరోసా = నమ్మకము -గో.కృ 69.

మకలం టెక్కెములు (60 20) మకల ? "మలక'' అయి ఉండవచ్చు.
మలక = మహమ్మదీయ

మలక టెక్కెములు = చంద్ర ధ్వజములు

మరిగి (28.8) మరలి.

మరుచునాడు (55 21; 24 8, 64.5) మరునాడు మరుసటినాడు The next day

మర్త్యాఖండం (54 14, 55·15) : ఒక విధమైన పెద్ద కత్తి
ఖండా = పెద్దకత్తి (శ.ర.)

మానువములు (59·22) పౌరుషములు అను అర్థమున వాడినట్లున్నది. నిఘంటువులతో లేదు

ముకాములు [41 12, 43 12, 49 21] "ముఖామునైన స్థానాపతులు'' అని రాయవాచకమే [49 21] ముఖాములనగా స్థానాపతులని అర్థ వివరణ ఇచ్చినది. ముఖీం N S Muqim A resident, ఉండే వాడు. కాపురముండేవాడు. అని బ్రౌ మిశ్ర పు 94 "గౌరవమొప్ప నచ్చటి ముఖాములు వ్రాయుదొడంగి రెంతయుడ్'' అని కృ రా. వి, 11, 113. "నిఘంటువుల కెక్కని పదములలోనిది యొకటి ముఖాము అనగా స్థానము. తద్ధర్మార్థమున స్థానికుడనుటకు "ముఖీము'' సరియైన రూపము. కృష్ణరాయవిజయమునందును కైఫియతులందును ముఖాములు అను రూపమే కన్పట్టుచున్నది''–గో. కృ. పు 38

మునుపటివారు వెనకటివారు యెడవంక్కవారల [57:19-20] ముందువరసల సైన్యము, వెనుక నిలిచిన సైన్యము, ప్రక్కల నుండి పోరాడే సైన్యము. **Vanguard, Rearguard and flanks.**

మును(న)కలు(గా) [21:1 ; 26 18,21 ; 74:5] ముందుగా.

మున్నెరిక [34:15]. మున్నెఱుక, ముందుగా తెలియునది.

ముల్లాశాస్త్ర ప్రవీణులు [42:1] ముస్లింధర్మశాస్త్ర ప్రవీణులు.

ముస్తీదు [25 3 , 28:23] సిద్ధము, ఆయత్తము. బ్రౌ. మిశ్ర. పు. 97; శ ర.పు.634,

ముస్తీపు [30.10] అలంకరించిన ముస్తీబు N S. Equipment, accourtment—బ్రౌ. మిశ్ర, పు 97.

మోర్చావేశి [58.23] నిఘంటువులలో లేదు. "దుర్గము చుట్టు త్రవ్వబడు కందకమును మోర్చా అందురు. యుద్ధము నిమిత్తమై త్రవ్వబడు కందక మనియు అర్థము. మోర్చావేయుట॥సైన్యము దింపుట అని వ్యవహారార్థము. మోర్చ పారశీపదము"—గో.కృ.పు. 69.

యాదిహెచ్చరికలు [ ]. యాద్ అనగా జ్ఞాపకము. హెచ్చరిక అను భావార్థము. ఏకార్థకపదములు జంటగా ప్రయోగింపబడినవి. చూడు గో కృ, పు. 70, బ్రౌ. మిశ్ర, పుట. 101.

యాయులు, స్థాయులు [67:18]. వచ్చినవారు, బయటనుండి, (ఇక్కడే నిలకడగా) ఉన్నవారు.

రసుసామగ్రీలు [34:16 , 35 2 , 35-21 ; 35 5 , 36-7 , 41 15 ; 45:24; 61 2; 62-12,14] 'రసద్' అనే పదానికి వికృతి - గో.కృ, పు. 69; బ్రౌ. మిశ్ర, పు 103. వస్తుసామగ్రి. సమూవార్థంలో "ధాన్యపున్ సామాగ్రు" లని కృ. రా వి, 11 121

రుమ్మీమత్తెఖండం [55:15] మూడు పైన మర్త్యఖండం. రూమీ మత్తెఖండమా? పెద్దకత్తి.

రొక్కరోజనాలు [68 10] ద్రవ్యము, వస్తువులు అను అర్థమున వాడినట్లున్నది.

రాలారిపురుషులు [86·12] అర్థము తెలియుట లేదు లాహిరి ( ? ) = మైకము.

లశికరీతనము [88:9] లష్కర్ = దండు దండనాయకత్వము, సైనికబలము.- గో క్ర, పు 68; ప్రా. మిశ్ర, పు. 107.

వరిశెలు [76 2] వరుసలు ( ), మర్యాదలు ( ? )

వింగ్గి [67:25] పీగి; ఓడి

వీడుకళ్ల [76:8] వీడుకోళ్ల ( ? )

వుదరదోలి [58 12] ఆదరవోలి

వూడెము [58:12] గూడెము ( )

వూడెములవారు [63 15] గూడెములవారు ( ? )

వెముఖాసరించ్చి [67 . 4]. సందర్భానిబట్టి "ఎదిరించి" అను అర్థము సరిపోవును.

వేటూరు [53 : 5] వేయారు, చూడువెయ్యారులు [56 · 6], వ్రేటుకు ఆరు, "వేటూరు తునుకలు" (53 5)

శెలవు సిద్ధాయాలు [24 . 13] : వ్యయము, రాబడి

సరాళము [53 9, 63 : 19] 'మార్గము' అను అర్థమున వాడినట్లున్నది.

సరుదుస్థలాలు [36 · 5; 38·8; 41 15, 18, 20, 13], సరిహద్దు పొలిమేర -ప్రౌ మిశ్ర పు 118

సారి మార్గము [72 17] దండుత్రోవ, సారి = యుద్ధయాత్ర (శ ర)

హజారము [23.9] 'హజారా' అను పారసీ పదము దీనికి మూలము ఆస్థానము, కొలువుకూటము, మొగసాల – గో క్ర ప్ర 24, ప్రౌ మిశ్ర,పు. 128

హామ్మత్తుగా [47,17] పెద్దగా, గొప్పగా (శ.ర), గట్టిగా, "హామ్మత్తుగా" [68:7]

హరివాణం కొమాళ్ల [44 18, 57 . 14] హరివాణ = అరివాణము = గిన్నె, గంగాళ. "**Harivanam** or **Arivanam** literally denotes the plate or dish from which the food is taken. Therefore, **Harivanam Kumallu** literally means the sons of the eating - dish It may be remembered in this connection that one of the classes of retainers of a Ring or Princes is called 'Kumallu' or sons They have the privilege of partaking the food left in the Plate of the king or prince after he finishes his meal. The **Harivanam Kumallu** mentioned here are evidently retainers of this class. They appear to have been recruited exclusively from the province of Araga which was sub-divided into 18 divisions known as **Kampanas**" -N. Venkata ramanayya, **Further Sources**, III P. 133, n.

హామిక్ [67:11] హామిక = ఆమిక = ఆము, పదము (శ ర.)

హురుమంజి [72·20] పారశీక దేశమందలి ప్రసిద్ధమైన రవ్వ —గో. కృ,81, బౌణప్ప, భా చా.వ్యా పు.212,

హాజీబులు [32 24] మంత్రి (శ ర ), (Hejeb'). a clerk? a writer? బ్రౌ.మిశ్ర, పు.130, "ఇది హాజిబ్ అను పారశీ పదమునకు వికృతి. ప్రభుత్వ వ్యవహారములను కాని తదితర కార్యములను గాని నిర్వహించు ఒక ప్రభువుల [illegible], లేఖకులు అను అర్థము నందును ఈ పదము ప్రయోగింపబడుచున్నది". —గో. కృ, పు 68.

# అనుబంధం 2 : అన్యదేశ్యాలు

**(వీని అర్థవివరణకై, చూడు. అనుబంధం 1)**

ఆయాలాయం (గుర్రాలు),
కత్తలాణి. (                )
కబాయి, కబ్బాయి,
కాకి(గి)తము, 4:7
కర్తారు, కత్తరు,
కుళ్లాయి,
కుర్నిసులు,
కొత్తవాలు (అనే తలారి),
కౌలు, కౌలిచ్చి, 68.9
జవురుజంగులు,
జాబు,
జీరా సంజోకం, (గుఱ్ఱములు)
జీరిజా (తాళ్ల),
టోకించు (?), 52.25; 58.7,
తాణ్యము, 41 16
ద(త)మామి, 52·25; 58 7; 62.18
డెరిజా,
తాకీతు,

దాదిమహాలు,
దివాణం, 48 19; 55.11
దునేదారులు (ర్లు), 17,
పర —

# అనుబంధం 3 : రాజోద్యోగాలు

రాయవాచకము

రాయసవాచకము

# అనుబంధం-4 : నామసూచి

**(రాజోద్యోగులు, ప్రసిద్ధ వ్యక్తులు)**

జ



డ



త

ద



ధ



న



ప

బ



భా



మ

# అనుబంధం - 5
# మధురనాయక రాజుల వంశవృక్షము

